# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[ Part II — Proceedings other than Questions and Answers ]

## OFFICIAL REPORT

43rd Day of the Sixth Session of the
Andhra Pradesh Legislative Assembly

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Friday, the 14th March, 1958.*

The House met at Half Past Eight of the Clock.

*[ MR. SPEAKER IN THE CHAIR ]*

## QUESTIONS AND ANSWERS

( See Part I )

## *REFERENCE TO THE APPOINTMENT OF DR. B. GOPALA REDDY, AS MINISTER OF STATE IN THE CENTRE.*

శ్రీ కె. వెంకటరెడ్డి (నందిపాడు): అధ్యక్షా! ఆర్థిక మంత్రిగారు కేంద్ర మంత్రివర్గంలో మంత్రిగా పోతున్నారని పత్రికలలో చూశాము. దాని విషయం తెలియజేయవలసిందిగా కోరుతున్నాను.

ముఖ్యమంత్రి (ఎన్. సంజీవరెడ్డి) : ఇవాళే అఫీషియల్ ఎనౌన్స్‌మెంట్ వచ్చింది. వారిని "మినిష్టర్ అఫ్ స్టేట్ ఫర్ ఎకనిమిక్ ఎఫైర్సు"గా తీసుకొన్నందుకు మనమంతా చాలాసంతోషించాలి. వారిని అభినందించాలి. (హర్షధ్వనులు) ఈవార్త, వారు బడ్జెటు జనరల్ డిస్కషిన్‌కు సమాధానం చెబుతూన్న రోజుననే అందింది. కాని, కన్‌ఫర్మేషన్, అఫీషియల్ ఎనౌన్స్‌మెంట్ రాకముందే సభ్యులకు చెప్పటం కష్టమైంది. కాబట్టి క్షమించండి. మన ఆంధ్రప్రదేశ్ తరఫున మొట్ట మొదట వారు మినిష్టర్‌గా అక్కడకు వెడుతున్నారు. చాలాసంతోషము. వీరు ఇండిపెండెంట్‌గా మినిష్టర్ అఫ్ స్టేట్ ఫర్ ఎనిమికల్ ఎఫైర్సుకు గా ఉంటారు. మొన్ననే జనరల్ డిస్కషన్‌లో, కేంద్రంలో ఒక్కరైనా మనమంత్రి లేరని, సభ్యులంతా ఆక్షేపించారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత, మొట్టమొదట మన

చీఫ్ సెక్రటరీని పంపాము. ఒక చీఫ్ జస్టిస్‌ను అక్కడకు పంపాము. మా కాంగ్రెసు పార్టీ తరఫున శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారిని సెక్రటరీగా పంపాము. ఇప్పుడు మినిస్టర్‌ను పంపుతున్నాము. కమ్యూనిస్టులుకూడ వారి పార్టీ తరఫున వాళ్ల జనరల్ సెక్రటరీగారిని పంపిస్తారని ఆశిస్తున్నాము. ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్ కూడ భారతదేశంలో ముఖ్యమైనదిగా గుర్తింపబడుతోంది. గోపాలరెడ్డి గారినే కాకుండా, తలవనితలంపుగా సికింద్రాబాదునుండి పార్లమెంట్ సభ్యుడుగా ఉన్న అహమ్మద్ మొహిద్దీన్‌గారిని డిప్యూటీ మినిస్టర్‌గా నియమించి నట్లు అఫీషియల్ ఎనౌన్స్‌మెంట్ వచ్చింది. ఇవి మనం కోరుకొన్నదానికన్నా ఎక్కువగానే వస్తున్నాయి. దీనికంతా కారణం — మనం సఖ్యతతో, ఐక్యతతో చక్కగా యీ కార్యక్రమాన్ని నడుపుకొంటున్నామన్న అభిప్రాయంతో పెద్దలు మనలను గౌరవిస్తున్నారని ఆశిస్తున్నాను. ఈ గౌరవాన్ని మనం నిలుపుకోటానికి ప్రయత్నించాలనికూడ కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ : వీరికి ఏ పోర్టుఫోలియో ఇస్తున్నారు ?

శ్రీ సంజీవరెడ్డి : ఫైనాన్స్ డిపార్టుమెంటును రెండుమూడు భాగాలుగా విభాగిస్తారు. రెవిన్యూ, ఎకనమిక్ ఎక్స్‌పెండిచర్ వగైరా భాగాలుగా విభాగిస్తారు. ఆ ఫైనాన్స్ డిపార్టుమెంటులోగల భాగాల్లో ఒక భాగం వీరికి ఇచ్చారు, వీరు సంపూర్ణమైన అధికారంలో ఉంటారు. వారు ఆ పోర్టుఫోలియోకి ఇండిపెండెంట్ చార్జి తీసుకుంటారు. ఎవరిక్రింద ఉండటం అన్నది లేదు.

## *POINT OF ORDER REGARDING CRITICISING TRIBUNALS*

మిస్టర్ స్పీకర్ : నేను మొన్నటిPoint of order regarding Criticising Tribunals విషయాలలో ఒక రూలింగ్ ఇస్తానన్నాను. కావాలని నిన్న ప్రత్యేకంగా రావి నారాయణరెడ్డిగారు అడిగారు. ఆనాడు రెండు విషయాలు జరిగాయి. ఒకటి ఏమిటంటే — లేడీ మెంబరుగారు స్పీకర్ స్థానములో ఉన్నప్పుడు ఆనరబుల్ మెంబర్ ఆఫ్ అపోజిషన్ ఒకటి సజెస్ట్ చేశారు. వారు ట్రిబ్యునల్‌మీద క్రిటిసైజ్ చేస్తూంటే, ఆవిధంగా చెప్పవద్దని ఆమె చెప్పగా, "అప్పుడే తీర్పు ఇవ్వకుండా, స్పీకర్‌గారు వచ్చేదాకా ఆపి, స్పీకర్‌గారు వచ్చిన తర్వాత తీర్పు ఇవ్వవలసిందని" వారు చెప్పారు. కాని కొంతమంది "ఆమె చైర్‌లో ఉన్నారు; ఆమెను గురించి అట్లా అనటం, ఆమె గౌరవానికి లోపం" అని అన్నారు. ఆమె మొట్టమొదట ఆ అభిప్రాయం ఏర్పరుచుకొని, ఆయన చెప్పిన సజెషన్ విత్‌డ్రా చేసుకోవలసిందని ఆ అపోజిషన్ మెంబరును కోరింది. తరువాత, వారు చెప్పింది విన్న తరువాత, "అందులో ఏమీ లేదు కనుక విత్‌డ్రా చేయ

వల్సిన అవసరం లేదు" అన్నారు. ఆమెకు అటువంటి హక్కు ఉన్నది. ఆమె సరిగానే చేశారు. She acted rightly — "దానిని విత్‌డ్రా చేయిస్తావా, లేదా అనటం" న్యాయం కాదు. అప్పుడు జరిగిన డిస్కషన్ వినగా అమెకు ఆ విధంగా తోచవచ్చును. తర్వాతకూడ రివోక్ చేసుకోవచ్చు. అసలు, అది చాలా చిన్న విషయం. "అయ్యా, స్పీకర్‌గారు వచ్చిన తరువాత చూడండి" అన్నారు. మేము చీఫ్‌మినిస్టర్‌గారు వచ్చేదాకా చూడండని ఒక మంత్రిగారిని కోరితే తప్పా? అట్లాగే డిప్యూటీ స్పీకర్‌ను గాని, పేనల్ అఫ్ చైర్‌మెన్‌ను గాని. "స్పీకర్ వచ్చేదాక చూడండి" అని చెప్పినంత మాత్రాన తప్పుకాదు. ఆమె చేసినది సరైనది. ఇక దాని విషయంలో తగాదా లేదు.

కార్మికశాఖామంత్రి (శ్రీ డి. సంజీవయ్య) : అధ్యక్షా! ఒక విషయం ఒక సభ్యులు చెప్పిన తర్వాత "అది చెప్పటం న్యాయంకాదు. దానిని విత్‌డ్రా చేసుకోండని ఒక రూలింగ్ ఇచ్చారు. రూలింగ్ ఇవ్వకపూర్వమే 'సభ్యులు ఏమి చెప్పారు, వారు చెప్పింది న్యాయమా, కాదా, అని విచారణచేసి రూలింగ్ ఇచ్చి ఉంటే బాగుండేదేమో —

మిస్టరు స్పీకర్ : నేను ఒకసారి రూలింగ్ ఇచ్చి, మరునాడు కాదని చెప్పాను. అటువంటి హక్కు ఉంది గనుక తగాదాలేదు. అటువంటి హక్కు ఆమెకు ఉంది. అందులో తగాదాలేదు.

శ్రీ యస్. కె. వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం—జనరల్) మొన్న శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు చైర్‌మన్ హోదాలో ఒక రూలింగ్ ఇచ్చారు. ఇప్పుడు, మీరు యిచ్చిన రూలింగ్ ఏమిటి ?

మిస్టరు స్పీకర్ : నేను నా అభిప్రాయం చెబుతున్నాను. అసలు, ముఖ్యమైన పాయింట్ ఒకటి ఉంది. ట్రిబ్యునల్స్‌ను ఎంతవరకు క్రిటిసైజ్ చేయవచ్చును అన్న విషయం చాలా కాంప్లికేటెడ్ మేటర్. అది ముఖ్యమైనది. ఇప్పుడు ఇది చాలా చిన్న విషయము. ఆమె చేసింది బాగుంది. "ఇట్లాంటిది వచ్చినప్పుడు తంటా ఇవ్వకండి" అని నేను జనరల్‌గా మెంబర్సుకు సలహా ఇస్తున్నాను.

ఇది అసలు difficult question. అయినా ఇది అనుకున్నంత difficult question కాదనుకోండి. మన Constitution లో ఉన్నది ఏమిటంటే:"హైకోర్టు జడ్జీలనుగురించిగాని, సుప్రీమ్ కోర్టు జడ్జీలను గురించిగాని ఎవ్వరుకూడ ఏమీ మాట్లాడకూడదు," అని ఉన్నది. "వారి Conduct గురించిగాని, వారు జరిపే procedure ను గురించిగాని ఏమీ మాట్లాడకూడదు అని ఉన్నది. India Constitution లో 211 వ నెంబరు ఆర్టికల్ ఏమి చెబుతున్నదంటే:-

"No discussion shall take place in the Legislature of a State with respect to the conduct of any Judge of the Supreme Court or of a High Court in the discharge of his duties."

ఇప్పుడు నిన్న యిక్కడ అసెంబ్లీలో జరిగిన విషయమును గురించి మాట్లాడుతున్నాను. ప్రభుత్వము ఏర్పాటుచేసిన Tribunals ఉన్నారు. ఈ Tribunals High Court Judges మాదిరి కాకపోయినా, వారియొక్క Conduct ను గురించి పొత్తుగా discuss చేయకూడదు. వారు High Court Judges category క్రిందికిరారు. Tribunal యొక్క మెంబర్లలో ఎవరైనా mislbhave చేస్తే, ఆవిషయమును గురించి యిక్కడ అసెంబ్లీలో discuss చేయటానికి అసెంబ్లీ మెంబర్లకు హక్కు ఉన్నది. కాని High Court Judges ను గురించి, Supreme Court Judges ను గురించి ఇక్కడ అసెంబ్లీలో discuss చేయటానికి మెంబర్లకు హక్కు లేదు. మనకు వారికి ఎలాంటి సంబంధము లేదు. కనుక మనము ఈ విషయముమాత్రము బాగుగ గుర్తించాలి. కాని మొన్న యిక్కడ మెంబర్లు విమర్శించినది చూస్తే ప్రభుత్వము Law తెలియనివారిని Tribunals గా వేస్తున్నారు, వారు labours విషయములో సానుభూతి లేకుండా, అన్యాయాలు చేస్తున్నారు అని అన్నారు. కొంతమంది, Tribunals ఎన్ని కేసులు మా పక్షము చేశారు అనిగూడ criticise చేశారు ఫలానా వారిని Tribunals గా ప్రభుత్వము వేసింది; వారు చేసేది అంతా అక్రమమే, ప్రభుత్వానికి ఇష్టమువచ్చినట్లుగా ఎవరెవరినో Law తెలియనివారిని, లేబరుమీద సానుభూతి లేనివారిని వేశారని అన్నారు. కాని ఇలాంటి విమర్శలు చేయడము అనేది అసెంబ్లీ రూల్సులోని 217 వ రూలు క్రిందకు వస్తుందా, రాదా అనేది మనము చూచుకోవలసి ఉన్నది. మన రూల్సు ప్రకారం చూస్తే ఈ Tribunals కూడ Judicial Officers క్రిందకే వస్తారు. వీరిని హైకోర్టువారు appoint చేసినను, ప్రభుత్వము appoint చేసినను, వీరందరు ఇతర Judges category క్రిందకే వస్తారు. ఈ Judicial Officers, వారు Judges అనండి, Tribunals అనండి, Magistrates అనండి. వీరు మూడురకాల Judical Officers గా విభజించబడ్డారు. వీరందరు High Court క్రింద సగము, ప్రభుత్వము క్రింద సగము అధికారాలతో Magistrates గా పనిచేస్తూంటారు. Judiciary నుంచి Executive ను separate చేసిన తరువాత కొంతమంది Judical Magistrates గా పనిచేసేవారు ఉన్నారు. కొంతమందికి Tribunals అని పేరుపెట్టి Estates Abolition Act ను గురించిన తగాదాలు, లేబరుకుసంబంధించిన తగాదాలు, యిలాంటి కేసులు అన్ని విచారించటానికి ప్రభుత్వము appoint చేసి function చేయమన్నారు. ఈ కేసుల కొరకు వీరిని ప్రభుత్వము చేత Tribunals అనే పేరుతో appoint చేయబడినప్పటికినీ, వీరందరుకూడ

Judges మాదిరిగ Judicial Officers క్రిందకే వస్తారు. కనుక ఇప్పుడు ఉన్నటువంటి ప్రశ్న ఏమిటంటే, ఇక్కడ అసెంబ్లీలో discuss చేయవచ్చునా, లేదా, చేయదలిస్తే Legislative Assembly కి సంబంధించినంతవరకు Rule 217 of the Andhra Assembly Rules యొక్క scope ఎంతవరకు ఉన్నది అనేది మనము చూచుకోవలసి ఉన్నది. Limitation on Debates అనే Heading క్రింద అసెంబ్లీ రూల్సులో ఏమి వ్రాసియున్నదో చూడండి.

"Limitations on debates:—Every speech must be strictly relevant to the matter before the Assembly.

217 Rules to be observed by members while speaking:—

A member, while speaking, shall not—

— — —

(iv) reflect upon the conduct of the President or Governor or any Court of Justice".

ఈ రూల్సు ప్రకారము ఇది Court of Justice అని ఉన్నది. కనుక Courtsను గురించి మనము ఏవిధముగాను, ఎవరిమీదను reflect చేయకూడదు అని మన అసెంబ్లీ రూల్సులోని 217 వ రూల్సులో కన్పిస్తున్నది. మద్రాసు అసెంబ్లీ రూల్సులోకూడ 1. Shall not reflect upon the conduct of the President or Governor or any Court of Justice" అని ఇదే మాదిరి రూలు ఉన్నది. ఇక్కడ ఇదివరకు ఉన్న హైదరాబాదు ప్రభుత్వముక్రింద ఉన్న అసెంబ్లీరూల్సులో కూడ అట్లాగే ఉన్నది. కాని కేంద్ర ప్రభుత్వములోకూడ కొంచెము హెచ్చుతక్కువగ ఇదే మాదిరి రూలు ఉన్నది. ఇప్పుడు రావి నారాయణరెడ్డిగారు చెప్పేది ఏమిటంటే, India Constitution లో ఎంతవరకు ఉన్నదో, అంతవరకే తప్ప, తక్కినది ఏమి చేసినను Ultra-vires యే అవుతుందని అంటున్నారు. Ultra-vires అంటే ఎట్లా? Constitution లో చాలా strict గా వ్రాయబడి ఉన్నది దానిని గురించి ఏ విధముగాను ఎవ్వరును జోక్యము కలిగించుకోకూడదు అని ఉన్నది. ఆ article కు లోబడి మన అసెంబ్లీ రూల్సు ఎంతవరకు frame చేసుకుంటే అంతవరకే discuss చేసుకోవచ్చును. ఇంతవరకు చేయకూడదు అనే విషయమును గురించికూడ మనము రూల్సు frame చేసుకోవచ్చును.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి (భువనగిరి):- అధ్యక్షా ! ఈ విషయమునుగురించి నేను Point of Order ఒకటి raise చేస్తున్నాను. మన అసెంబ్లీ రూల్సులోని 217(4) వ Rule లో "Shall not reflect upon the conduct of the President or Governor or any Court of Justice" అని వ్రాయబడి

ఉన్నది. ఇందులో "Any Court of Justice" అని clear గా, చాలా విశాలముగ యీ wording ఉపయోగించబడియున్నది. నా అభిప్రాయములో Rule 217(4) of the Andhra Assembly Rules ultra-vires అని అనుకుంటున్నాను. ఈ Article 211 ను ఇప్పుడు అధ్యక్షులవారుకూడ చదివి 'వినిపించారు. దానిని గౌరవ సభ్యులందరు శ్రద్ధతో పరిశీలించవలసిందిగా కోరుతున్నాను.

"No discussion shall take place in the Legislature of a State with respect to the conduct of any Judge of the Supreme Court or of a High Court in the discharge of his duties."

అంటే Constitution క్రింద అసెంబ్లీ సభ్యులయొక్క పౌరసత్వాలకు కొన్ని limitations పెట్టబడినవి. అవి కోర్టులకు, జడ్జీలకు సంబంధించినంతవరకు ఆ limitations పెట్టబడినవి. అదే ఈ 211 వ ఆర్టికల్‌లో పొందుపరచబడినవి. అందులో ఒకటే విషయము చెప్పబడియున్నది.

"......with respect to the conduct of any Judge of the Supreme Court or of a High Court in the discharge of his duties." ఒక High Court Judge కు వ్యతిరేకముగానైనా, లేక ఒక Supreme Court Judge కు వ్యతిరేకముగానైనా. వారు వారియొక్క విద్యుక్త ధర్మమును నిర్వహించడములో ఏవైనా పొరబాట్లు చేసియున్నట్లైతే, దానిని attack చేసే అధికారము అసెంబ్లీ సభ్యులకుమాత్రము లేదు అనే limitation ఒకటి మాత్రమే Constitution లో పెట్టబడి ఉన్నది. ఇక పోతే మిగిలిన విషయాలలో అంటే కోర్టులకు సంబంధించిన మిగతా విషయాలలో Constitution లో ఏలాంటి limitations కూడ పెట్టలేదు. Rules frame చేసే విషయములో ఈ అసెంబ్లీకి unlimited powers లేవు. Constitution ప్రకారమే అసెంబ్లీకి unlimited powers లేవు. Constitution కు లోబడే ఈ House Rules ను frame చేయవలసి ఉంటుంది. India Constitution లోని 208 వ Article ను అనుసరించి,

"208 (1) A House of the Legislature of a State may make rules for regulating, subject to the provisions of this Constitution, its procedure and the conduct of its business."

ఎసెంబ్లీకి unlimited powers లేవు అనే దృష్ట్యా Constitution లో యింకొక procedure కూడఉన్నది. హైకోర్టుజడ్జీలయొక్క conduct ను గురించి, Supreme Court Judges యొక్క conduct ను గురించికూడ, Constitution లో ఆ limitations కూడ ఎందువల్ల పెట్టవలసి వచ్చిందంటే, Constitution లో వేరే Article లో High Court Judges గాని Supreme Court Judges

గాని misbehave చేసిగాని, misconduct చూపించిగాని ఉన్నట్లయితే, వారిని ఏవిధముగ తీసి వేయాలి అనే Procedure కూడ పెట్టబడింది. అందువల్లనే ఆ limitations పెట్టబడినవి అందువల్ల యిప్పుడు దానికి Point of Clarification కూడ ఇప్పుడే నేను లేవదీయదలచలేను. ఈ conduct అనే పదమునకు నిర్వచనము ఏమిటి ? దానికి interpretation ఏమిటి ? High Court Judges ఇచ్చేటటువంటి Judgements ను Challenge చేయడమునకుగాని, విమర్శించడమునకు గాని అధికారము యీ ఎసింబ్లీకి ఉన్నదా ? లేదా ? లేకపోతే వ్యక్తిగతముగ కనబడిన వారియొక్క misbehaviourను గురించి, లేకపోతే వారియొక్క incapacity ను గురించి మాత్రమే attack చేయవచ్చునా ? లేదా ? అనేదికూడ విమర్శించకూడదా అనేదానికి కూడ point of clarification ను నేను యిప్పుడే లేవదీయదలుచుకోలేదు. ఇప్పుడు fundamental గా ఉన్నది, 217 (4) వ రూలు ప్రకారము గవర్నరు విషయములోను, ప్రెసిడెంటు విషయములోనూ ఎవ్వరు గూడ విమర్శించకూడదు అనేదానికి నాకేమి ఆక్షేపణలేదు. కాని Constitution లో విశాలముగా, limitations పెట్టనిదే రూల్సులో పెట్టడము మాత్రము Rule 217(4) of the Assembly Rules ultra vires అని నేను భావిస్తున్నాను. ఏ Civil liberty గాని, ఏ పౌరసత్వ హక్కులుగాని Constitution ఇచ్చిందో అందులోకొన్ని limitations మాత్రము Constitution పెట్టింది. ఆ limitations ను దాటి ఈ అసెంబ్లీ అలాంటి రూలును frame చేయడము ultra-vires అని నా యొక్క అభిప్రాయము. Constitution గౌరవ సభ్యులకు ఇవ్వనటువంటి హక్కును యీ రూలుద్వారా లాగుకునే వీలులేదు. వారికి unlimited powers లేవు గనుక, దీనిని గురించి అధ్యక్షులవారు ప్రత్యేకంగా రూలింగు యివ్వాలని కోరుతున్నాను. ఎందుకంటే ఇది సభ్యులయొక్క పౌరసత్వపు హక్కులకు సంబంధించిన విషయము గనుక, దీనికి అధ్యక్షులవారి రూలింగు అవసరము గనుక రూలింగు యివ్వమని కోరుతున్నాను.

*The Minister for Planning (Sri V. B. Raju):* What the hon. Member has contended is that the rule relating to the subject is *ultra-vires* of the Articles of the Constitution and he mentioned that the rules must be framed subject to the provisions of the Articles of the Constitution. What is said in the Constitution is that the conduct of High Court Judges and Supreme Court Judges shall not be questioned. Supposing, we make a rule that their conduct could be questioned, then it becomes *ultra-vires.* There is no bar or impediment before the Assembly to impose or to have self-restraint. Supposing, the hon. Assembly decides that we shall not discuss this

or that, that is not *ultra-vires*. It is self-imposed restraint. It is only to keep the dignity and the level of debate in the House that we have some restraint on us. And I think we are perfectly within the purview and within the limits that have been imposed on us, and it is never *ultra-vires*.

*Sri M. Rajeswara Rao (Divi-Reserved) :* Mr. Speaker, Sir. If I remember correct, the comment made was with regard to the appointment of judges made by the Government and not with regard to the discharge of functions by the judges after they are appointed. So, this is only by way of clarification before the hon. Speaker gives his ruling. I request that the ruling may also have a reference to this point.

శ్రీ బి. రత్నసభాపతి (బద్వేల్):- అధ్యక్షా, మీరు raise చేసిన point కు యిప్పుడు వచ్చిన point కు తేడా ఉన్నది. వెంకటేశ్వర్లుగారి ఉపన్యాసంలోని కొన్ని భాగాలకు మాత్రమే యీ Ruling వర్తిస్తుందనుకొంటాను. వారు Tribunals' Conduct గురించి మాట్లాడలేదు. Appointments గురించి మాట్లాడినారు. అది గమనించవలసిన విషయం. Appointments ను గురించి అసెంబ్లీలో criticise చేయకూడదనిగాని, condemn చేయకూడదనిగాని Constitution లో ఎక్కడా లేదు.

*Sri V. B. Raju :* I think there is a point of Order raised by an hon. Member. I submit that a ruling should be given first on that, and the subject matter relating to the speech may be taken up later on. These two things are quite different.

శ్రీ బి. రత్నసభాపతి:- ఇది ఒక point. వెంకటేశ్వరులుగారు దీనిని గురించి మాట్లాడలేదు. Appointments గురించి మాత్రమే మాట్లాడినారు. Appointments ను గురించి మాట్లాడకూడదని Constitution లో ఎక్కడా లేదు. "Reflect on the conduct of the President, Governor and any Court of Justice." అని Constitution లో clear గా ఉన్నది. అది రావి నారాయణరెడ్డిగారు చదివి వినిపించారు. High Court Judge కీ, Supreme Court Judge కీ-యీ ఇరువురికి మాత్రమే పరిమితమై Constitution లో ఉన్నది. అయితే, Tribunal అనేది Court of Justice క్రిందకు వస్తుందా, లేదా యని మనం యిప్పుడు ఆలోచించవలసియున్నది. Tribunals యొక్క అధికారాలకు, Procedure కు, Court of Justice కు ఉన్న Procedure కు చాలా భేదాలున్నాయి. కాబట్టి Tribunals అనేవి Courts of Justice క్రిందకు

రావని నా అభిప్రాయం. Constitution లో ఉన్నదానికి, ఇక్కడ ఉన్న Rule కూ సంబంధం లేదు. కాబట్టి Tribunals ను విమర్శ చేసే అధికారం మనకు సంపూర్ణంగా ఉన్నదని నేను భావిస్తున్నాను.

శ్రీ జె. ఆనందరావు (మెట్పల్లి) : Conduct అనేపదం యొక్క నిర్వచనంలో రెండు అర్థాలు ఉన్నాయని రావి నారాయణరెడ్డిగారు సెలవిచ్చారు, నా దృష్టిలో Judge గారు విచక్షణ చేసేటప్పుడు సరైన విచక్షణ చేశారా, లేదా అని ఆ Judge ని మనం పేర్కొనడం, వారిపై ఆరోపణలు చేయడం సరైనది కాదు. కాని Tribunalకు సంబంధించినంతవరకూ, అర్హతానర్హతలను, యోగ్యత, అయోగ్యతలను గురించిన్నీ, విచక్షణచేసే పద్ధతిని గురించిన్నీ మాట్లాడడానికి సభ్యులకు హక్కు ఉన్నదని నా అభిప్రాయం. అయితే, వారి విచక్షణలో తప్పు చేశారా, ఒప్పుచేశారా అనే విషయమై మాట్లాడే అర్హత సభ్యులకు ఉండకూడదు. Judge చేసేటప్పుడు ఏ procedure ను అవలంబించారో అది సరైనదా; కాదా అనే కాని ఆ జడ్జియొక్క అర్హతానర్హతలను గురించి చర్చించే అవకాశం సభ్యులకు ఉండకూడదు. కాబట్టి conduct ను గురించి ఆ విధంగా వ్యాఖ్యానం చేయాలని నేను కోరుతున్నాను.

మిస్టిరు స్పీకర్ : ఇందులో రెండు విధాలుగా ఉన్నది. వారు ఎన్ని కేసులు లేబరు పక్షాన చేశారు ? అనగానే పక్షపాతం వహించారనే అర్థంవస్తుంది. వారిది capatalist mind అనే పద్ధతిలో చెప్పేవన్నీ reflections. అంతేకాని appoint చేయడంలో వారిని వేయలేదు, వీరిని వేయలేదు అనేదికాదు. Law తెలియనివారు, capatalist mentality గలవారు, వారు లేబరు పక్షాన పనిచేయరు. కాబట్టి వీరిని appoint చేస్తే ప్రయోజనంలేదు, మమ్ములని consult చేసి, మరీ appoint చేయండి' అనే మాటలున్నాయి. కనుక యిది 'they reflect upon the conduct' అనే దాని క్రిందవస్తుందని నా అభిప్రాయం.

రెండవది, 'Court of Justice' అనే విషయంలో May's Parliamentary Practices' లోని rules వంటివి. కూడా మనకు వర్తిస్తాయి. మనం follow అవుతున్నాము. House of Commons లోని విధంగానే Lok Sabha లోని వాటినికూడ అనుసరిస్తున్నాము.

"Breaches of orders in speaking లో 'They should not speak against persons in high authority' 'unless upon a substantive motion, for that purpose, upon the conduct and persons in authority' అని కూడా ఉన్నది. తరువాత 'words against the cha-

racter, proceedings of either House' — Members గురించి కూడ మాట్లాడకూడదన్నారు.

కాబట్టి general principles అన్నీ ఉన్నాయి. అట్లా అయితే, సభ్యుల యొక్క character గురించి మాట్లాడవచ్చా? ఎందుకు మాట్లాడకూడదు? అనేవి వస్తాయి. కాబట్టి High Court గురించి Constitution లో ఉన్నది సర్వత్రా apply అయ్యేదికాదు. హైకోర్టు వారి హక్కుల గురించీ, హోదాల గురించీ సంబంధంలేదు. వారిజీతాలను గురించి discuss చేయకూడదు. General గా Members యొక్క conduct గురించి మాట్లాడకూడదు. ఆ విధంగానే స్పీకరులను గురించికూడా మాట్లాడకూడదు. ఒక list ఉన్నది.

"A member while speaking may not allude to a debate in the same session, speak against or reflect upon the determination of the House, allude to debates in either House of Paliament, utter treasonable or fictitous words,..." అని ఉన్నది.

ఆ list ప్రకారమే యివన్నీ వస్తాయి. generalగా మనం Rules తయారు చేసుకోవచ్చును. Lok Sahba చేసినది, Hyderabad House చేసినది, Madras House చేసినది. మనం వాటిని అనుసరిస్తున్నాము. We are following the procedure that is followed in the House of Commons. అందువల్ల 'Reflect unless upon a substantive motion for that purpose, and on the persons in authority' వారు యిచ్చిన list లో యిదికూడా ఉన్నది.

శ్రీ రావి నారాయణరెడ్డి.- అధ్యక్షా! మీరు సలహా యిచ్చిన విషయాలను గురించి నేను కొందరి lawyers తో ఆలోచించాను. నాకు Constitutional Law అంతగా తెలియదు. British Parliament కు unlimited powers ఉన్నాయి వారు ఎటువంటి Rules అయినా చేసుకోవచ్చు. వారిది written Constitution కాదు. Convention రూపంలో వస్తుంది. కాని మన Constitution అటువంటిది కాదు. మనది Written Constitution. మన House కు unlimited powers లేవు. కాబట్టి, ఒకవేళ Constitution లో ఏదైనా ఒక subject ను గురించి ఏమీ ఉండకపోతే మనం Rules చేసుకుంటే ఫరవాలేదని భావించవచ్చు. కాని Courts కు సంబంధించిన విషయాలు కొన్ని specific గా మన Constitution లో ఉన్నాయి కొన్ని limitations' ఉన్నాయి. Constitution లో సభ్యులకు ఉండిన హక్కులను లాక్కోవడమనేది పూర్తిగా ultra-vires అని నా అభిప్రాయము,

14th March, 1958]

శ్రీ వి. బి. రాజు : మర్యాదగా మాట్లాడుకోవాలని మనం limitations పెట్టుకోకూడదా?

శ్రీమతి సి. అమ్మన్నరాజా (అత్తిలి) : అధ్యక్షా ! ఇప్పుడు మనకు కొన్ని Rules ఉన్నాయి. Rules కు సంబంధించిన discussion లో తప్ప, ఆ Rules సరికావని, ఎప్పుడుపడితే అప్పుడు discuss చేయడానికి వీలుందా అని నేను మిమ్ము లను అడుగుతున్నాను.

మిస్టర్ స్పీకర్ : ఇప్పుడు వారు ultra-vires అన్నారు. కనుక ఈవిషయం వచ్చింది. Constitution లో ఉన్నవాటిని గురించి మనం Rules చేసుకోడానికి general గా అధికారం ఉన్నది. ఇక దీనిని గురించి నేను సభాకాలమును వృధా పరచదలచుకోలేదు. ఎవరో లాయర్సు చెప్పారని నారాయణరెడ్డిగారు చెప్పినంత మాత్రాన నేను ఒప్పుకోను. Advocate-General వ్రాసి ఇస్తే అప్పుడు దానిని గురించి ఆలోచిస్తాము. అంతేకాని, ఎవరో చిన్న లాయరులు నారాయణరెడ్డి గారి ద్వారా కబురంపినారు అంటే నేను వినదలచుకోలేదు.

రూల్సులో ఉన్నవి 'మే' పార్లమెంటరీ ప్రాక్టీసులో 'even Magistrates' అని ఉన్నది. If they reflect on the Conduct of Magistrates, the Speeker took objection.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : బ్రిటిష్ పార్లమెంటుకు unlimted powers ఉన్నాయి. మనకు అలాంటి పవర్లు లేవు.

మిస్టర్ స్పీకరు : మనకుకూడ unlimited powers ఉన్నవి. మీతో ఫలానా దానినిగురించి మాట్లాడకూడదని చెప్పిన లాయర్సు మన పవర్సును రిస్ట్రిక్ట్ చేస్తు న్నారు. కనుక ఆ opinion మీరు తీసుకోవద్దు. నిన్న వారు చేసిన రిమార్కులు సరియైనవి కావు. అలాంటిది ఎవ్వరు చేయవద్దు. ఛైర్మన్‌గా వున్న లేడీ మెంబరుగారు కరెక్టు రూలింగే ఇచ్చారు. ఇప్పుడు నేను చేయవలసింది ఏమీ లేదు. ఆమె ఇచ్చిన రూలింగుతో నేను ఏకీభవిస్తున్నాను.

శ్రీ ఎన్. పి. చెంగల్రాయ నాయుడు (వేపంజేరి) : అధ్యక్షా ! అసెంబ్లీ రూలు 74 క్రింద చక్కెర ఫ్యాక్టరీ గురించి మనవిచేసినాను....

మిస్టరు స్పీకరు : రేపు వస్తుంది.

## *BUDGET* - DEMANDS FOR GRANTS

DEMAND NO. X—*Heads of State, Ministers and Head-quarters Staff.—Rs. 1,14,16,100*

DEMAND NO. XI—*State Legislature.—Rs. 38,72,700*

*Sri N. Sanjeeva Reddi :* Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I beg to move :

"That the Government be granted a sum not exceeding Rs. 1,14,16,100 under Demand No. X—Heads of State, Ministers and Headquarters Staff."

"That the Government be granted a sum not exceeding Rs. 38,72,700 under Demand No. XI—State Legislature."

*Mr. Speaker :* Motions moved.

శ్రీ ఎన్. సంజీవరెడ్డి : అధ్యక్షా ! 10, 11 నంబర్ల డిమాండులను సభ అంగీకారమునకై పెట్టబడినవి. పదవ డిమాండుకు 114 లక్షల 16 వేల ఒక వంద; పదకొండవ డిమాండుకు 38,72,700 మంజూరు చేయవలసిందిగా కోరుచున్నాను. నేను ఇప్పుడు పాలిసి స్టేట్ మెంటు ఏదీ చేయుటలేదు. అత్యవసరమైన ఈ రెండు డిమాండులను ప్యాసుచేయమని సభ్యులను కోరుచున్నాను. ఒక డిమాండులో మన సభాసమావేశమునకు గవర్నరు, మంత్రులు, సెక్రటేరియట్ కు సంబంధించినది. ప్రజాస్వామిక సిద్ధాంతమును బలపరచడం ఎంత అవసరమో నేను చెప్ప పనిలేదు. ప్రభుత్వము చాలా అవసరమైన ఖర్చు మాత్రమే చేస్తున్నది. ఎన్నికలను జరుపుటలో, ప్రభుత్వములను ఏర్పాటు చేయుటలో, సమావేశాలను జరుపు కొనుటలో ఎంత ఖర్చు అయినా సరే వాటిని చేయక తప్పదు. అవసరమైతే ఇతరచోట్ల ఖర్చులను తగ్గించుకోవచ్చుగాని ఈ పద్దులలోమాత్రం వీలుకాదు. ఇంకా ఎన్నికల కర్యై ఖర్చులో ఎక్కువైనా మనం తప్పక అంగీకరించవలసిందే. వాటిద్వారా ప్రజాస్వామిక సిద్ధాంతమును బలపరచుకోవలసిందే. సభ్యులు ఎన్నికలగురించి ఏమైన మంచి సూచనలు చేస్తే ప్రభుత్వం తప్పక ఆలోచిస్తుంది. గత 15 నెలలుగా ప్రతిపక్ష సభ్యులు చేసిన ఉపన్యాసములనుబట్టిగాని, ఇతర సభ్యుల ఉపన్యాసములను బట్టిగాని ఇప్పటివరకు జరిగిన ఎన్నికలలో లోపాలు ఎక్కువగా లేవని అనుకొనుచున్నాను. ఎన్నికలు జరిపే పద్ధతి, ఎన్నికల ఉద్యోగస్థుల విధానం చాలా సవ్యంగానే ఉన్నదని నేను భావిస్తున్నాను. ఎక్కడో ఏ ఎన్నికలలో ఎవరు గెలిచినా, ఎవరు ఓడినా, పోటీచేసినవారిమధ్య తర్జనభర్జనలు అక్కడక్కడ జరిగినా ప్రభుత్వం, ప్రభుత్వ ఉద్యోగస్తులు సక్రమంగా, న్యాయంగా, సవ్యంగా ఎన్నికలను జరిపినారనే మనమంతా భావిస్తున్నాం. కాబట్టి ఖర్చు తప్పనిసరిగా ఔతుంది.

ఇక అసెంబ్లీలో ఎవరైనా సూచనలు చేస్తున్నప్పుడు బాధ్యతతో చేయవలసి ఉంటుంది. ఒక్కొక్క సభ్యుడు లక్ష ప్రజానీకమునకు ప్రతినిధిగా ఇచ్చట ఉన్నాడు. కొన్ని ఉపన్యాసములు విన్నప్పుడు నాకు చాలా విచారం కలిగింది. ఎక్కడో బహిరంగ సభలలో లేక రాజకీయ వాద ప్రతివాదములు జరుగుతున్నప్పుడు, చేయవలసిన ఉద్రేకపూరిత ఉపన్యాసములను ఇచ్చట చేయుటవల్ల ప్రభుత్వమునకు, ప్రజాస్వామ్యానికి ఏమాత్రమూ ఉపయోగపడదని మనవి చేయుచున్నాను.

ముఖ్యంగా నిన్న డిమాండుపై మాట్లాడుచూ మంత్రులు పల్లెటూర్లుకు పోరుగదా, పోయినట్లు T. A. Bills మాత్రం వ్రాసుకుంటున్నారని ఒక సభ్యుడు చెప్పినారు. ఆ విషయం విన్నప్పుడు ఏ లెవెల్ కు ఇక్కడ ఉపన్యాసములు దిగజారిపోయినవో, నాకు ఎంత బాధ కలిగిందో చెప్పలేకుండ ఉన్నాను. అలాగ ఎవరైన చేసి ఉంటే ఈ ప్రభుత్వమునకేకాదు, ఆంధ్రదేశానికే సిగ్గుచేటు అని చెప్పుచున్నాను. దయచేసి అలాగ ఏ మంత్రి చేసినాడో చెప్పమని అడుగుచున్నాను. బాధ్యతకలిగిన సభ్యుడు, ఏ పార్టీవారైనా సరే మాట్లాడునప్పుడు దానిలో కనీసం 10% అయినా నిజం ఉన్నదా అని ఆలోచించుకోవాలి. High level of standard ను నిర్మించుకోక బజార్లలో మాట్లాడినట్లు మాట్లాడినచో చిన్న చిన్న వార్తాపత్రికలు, చెడువ్రాతలు వ్రాయుటకు ప్రోత్సాహ మిచ్చినట్లు అవుతుంది. ప్రభుత్వంలో జరుగు లోపాలను, మంత్రులు చేసిన తప్పులను స్పెసిఫిక్ గా చెప్పితే విచారించి తగు చర్య తీసికొను టకు సాధ్యమౌతుంది. ఆ విధంగా మనం level of standard ను పెంచుకోక పోయినట్లయితే మన గౌరవమును, అసెంబ్లీయొక్క, రాష్ట్రంయొక్క గౌరవ మును కించపరచినవారమౌతాము. మంత్రుల గౌరవం కాదు. మంత్రులు ఈవేళ ఉండవచ్చు రేపు లేకపోవచ్చు. మన గౌరవమును, మన రాష్ట్ర గౌరవ మును, 3 కోట్ల 30 లక్షలమంది గౌరవమును కాపాడవలసిన బాధ్యత మన అందరిమీద ఉన్నదని గుర్తెరిగి ఉపన్యాసములు చేస్తే బాగుంటుందని నేను మీ ద్వారా వినయపూర్వకంగా మనవిచేయుచున్నాను.

మన ఆంధ్రదేశంలోని దినపత్రికలన్నీ చదువుతాను. విశాలాంధ్రను మరీ జాగ్రత్తగా ఉపయోగబడే political criticisms ఉంటవనే దృష్టితో చదువు తాను. డజన్లలో ఉన్న వార పత్రికలను చదువుటకు వ్యవధిలేదు. కొన్ని వార పత్రికలను చూచి వాటిని చదువుటలో కాలయాపన చేయుట అనవసరమనిపిం చింది. కాని మన Information Department నాకు కొన్ని cuttings పంపి స్తుంటారు. అలాంటి cutting ఈ రోజున నా చేతికి వచ్చింది. అది చూచి మా మిత్రుడు జె. వి. నరసింగరావు ఆశ్చర్యపొయ్యారు. ఆయనతో నేను ఇంకా మాట్లాడలేదు. రాత్రి ఏ పదిగంటలకో నాకు ఆ cutting వచ్చింది.

అది ములుకోల పత్రిక. అది చాలా ప్రాముఖ్యమైనదని కొందరు చెబుతూ వుంటారు. ఎవరినో బెదిరించటం, 100, 200 రూ. లో ఇచ్చుకోవటం, సరిదిద్దు కోవటమే ఆ పత్రిక పని. ఆ పత్రిక "కృష్ణా బారేజ్ పనికి గవర్నమెంటు ఎస్టిమేట్సు లేకుండానే సంజీవరెడ్డి 10 లక్షల రూపాయలను మంజూరు చేశారు" అని ప్రక టించింది ఎస్టిమేట్స్ తయారు చేయకుండా, సెక్రటేరియట్ లో తెల్పకుండా, డబ్బు మంజూరు చేయకుండా 10 నయాపైసలను కూడ ఇవ్వలేను. నరసింగరావు గారు ఆ వార్త చదివి ఆ పత్రికను ప్రాసిక్యూట్ చేద్దామా? అని అడిగారు.

వయస్సులో వారు నాతోసమానముగావున్నా అనుభవం తక్కువ. చాలా కాలము నుండి మేము తిట్లు తింటూనే వున్నాము. వారు ఇప్పుడిప్పుడే తింటున్నారు. వారు ములుకోల పత్రికను ప్రాసిక్యూట్ చేయాలని చెప్పారు. వీధిలో పోతున్న మనిషి ప్రక్కనున్న గట్టర్‌పై రాయివేస్తే అది అతని ముఖము మీదనే చిందుతుంది. ఈ విధమైన వార్తలు ప్రచురిస్తేగాని వాటి గౌరవము, ప్రతిష్ట పెరగవు. ఒకసారి కల్లూరి సుబ్బారావుగారి భార్య లేచిపోయిందని ఒక పత్రిక ప్రచురిస్తే 'నా భార్య చనిపోయి 20 సంవత్సరా లయిం'దని వారు అందరకు చెప్పుకోవలసి వచ్చింది. 10 లక్షలను మంజూరు చేసినందుకు ముంద్రా కేసుపై చాగ్లాను వేసినట్లుగా, దీనిని విచారించటానికి ముగ్గురు జడ్జీలను నియమించాలి అని కూడా వ్రాసింది. నా పార్టీని, నన్ను, బలపరిచే సభ్యులేకాక అపోజిషన్ పార్టీ లీడర్స్ కూడా ఇటువంటి చార్జీలలో ఒక్క పర్సంటు అయినా నిజము వున్నదని కాని, వుండటానికి అవకాశం వున్నదని చెబితే మేము ఇక్కడ వుండనవసరంలేదు. చాగ్లా వంటి వారిని నియమించే అవసరం కూడా వుండదు. ఇటువంటి విషయములలో జాగ్రత్తగా వుండాలనే నేను భావిస్తున్నాను. ములుకోలతో సమానంగా ఉండాలనే భావంతో గాని, లేదా ఆ పత్రికను మించిపోవాలనే భావంతో గాని 'నవశక్తి' అనే పత్రిక కూడా ఇదేవిధమైన వార్తలను ప్రచురిస్తూ వుంటుంది. "ఫలానా వ్యక్తి లంచం తీసుకొన్నారు. లేదా ఫలానా ఉద్యోగి లంచం తీసుకోటానికి వీరి మద్దతు వుంది అని మేము ప్రచురించినా మాపై కేసు పెట్టరేమి?" అని ఆ పత్రికల వారు అంటూ వుంటారు. నవశక్తి, ములకోల వంటి మురుగుపై రాయివేసి దానిని ముఖంమీద చిల్లించుకోవటం, సవాలు చేయటం అనవసరమని నేను అనుకొంటున్నాను. అటువంటి పత్రికలకు ప్రోత్సాహం ఇవ్వక, ఏదైనా, ఎక్కడైనా జరిగితే అది ఇక్కడనే తెల్పాలని నేను మనవి చేస్తున్నాను.

తెలంగాణా వారికి ఈ ప్రభుత్వము ఏవో అక్రమాలు చేస్తోందని, ఉన్న ఎగ్రిమెంట్లను కాలురాచేస్తోందని కొందరు ఉపన్యాసాలలో చెప్పారు; తీర్మానాలు చేశారు. 'సంజీవరెడ్డి నియంతగా పరిపాలిస్తున్నాడు' అని కూడా వారు ప్రసంగిస్తున్నారు. గట్టిగా పరిపాలించమనే నన్ను ముఖ్యమంత్రిని చేశారు. ఒక్క కాంగ్రెస్ వారేకాక, సోషలిష్టులు, కమ్యూనిష్టులు 3 కోట్ల 30 లక్షల మంది ప్రజ ఈ రాజ్యాన్ని గట్టిగా, సమర్థతతో పరిపాలించ**మని** నన్ను ముఖ్యమంత్రిని చేశారు. ఒక వైపుకు ఒకరు లాగితే, మరొకవైపుకు మరొకరు లాగితే ఒక వైపుకు లొంగిపోవటానికి నన్ను ఈ స్థానములో వుంచలేదు.

"బలశక్తికిగాని, ధనశక్తికిగాని సంజీవరెడ్డి లొంగడు. తాను న్యాయమనుకొన్న దానిని చేస్తాడు" అనే విశ్వాసముతోనే నన్ను ఇక్కడ వుంచారు. ఆ విధంగానే నేను వుంటున్నాను. మరి ఇంకో విధముగా ఎలా నడుచు కోవాలో నాకు

అర్థం కావటము లేదు. గౌరవ సభ్యులు ఇచ్చిన సలహాలను నేను చేయనని చెప్ప లేదు. నే నేదైనా తప్పు చేస్తే సుందరయ్యగారు కాని, రావి నారాయణరెడ్డిగారు కాని, రత్న సభాపతిగారు కాని వేదికపైన చెప్పినా సరిదిద్దుకోటానికి నేను సిగ్గు పడను. సరిదిద్దు కోవటానికి సిద్ధంగా వున్నాను. సంతకాలకు, బెదిరింపులకు లొంగి, సరికాదని తెలిసినా కూడా అన్యాయాన్ని చేయటం కంటే ఇక్కడనుండి వెళ్ళి పోవటమే ఉత్తమ మని మనవి చేస్తున్నాను. 305 మందిలో 40 మంది సంతకాలు పెట్టినంత మాత్రమున బెదిరిపోతే నేను కాదు యింకా ఎవరైనా పరిపాలించలేరు. నిదర్శన పూర్వకంగా ఒక్క సభ్యుడు చెప్పినా, తప్పును దిద్దుకోటానికి నేను సిద్ధంగా వున్నాను.

తెలంగాణా విషయాల గురించి ఉద్యోగస్తుల గురించి నాల్గు రోజుల క్రింద తెలంగాణా మహాసభ చేసిన తీర్మానమును జాగ్రత్తగా పరిశీలించాను. తెలంగాణా ఉద్యోగస్తులకు ప్రొమోషన్లను పోగొట్టి, ఆంధ్ర నుండి వచ్చిన వారికి ఇవ్వటం గొప్ప అని నేను భావించటం లేదు. ఏ ఉద్యోగస్తుడు పొందినా సంతోషమే. డిపార్టుమెంటులో జరిగే అవక తవకల గురించి గోపాలరెడ్డిగారు విపులముగా చెప్పారు. Sales-tax department లో జరిగాయని చెబితే ఆ డిపార్టుమెంటుకు సంబంధించిన మంత్రిగారు ½ గంట సేపు explanation ఇచ్చారు. మిగిలిన డిపార్టు మెంటులలో ఏదైనా జరిగివుంటే జరిగివుండవచ్చును. వాటిని తెల్సుకొని సరిదిద్దా లనే మా ఉద్దేశ్యము.

10 వ తేది కాబినేట్ సమావేశమైనప్పుడు ఛీఫ్ సెక్రటరి అధ్యక్షత క్రింద ఒక కమిటీని వేశాము. తెలంగాణాలో సీనియర్ అఫీసర్స్ అయిన గులాం హైదరు గారిని, గుప్తా గారిని ఆ కమిటిలో వేశాము. ప్రమోషన్లలోగాని, గ్రేడ్స్‌లోకాని అన్యాయము జరిగితే వారికి చెప్పుకోవచ్చును. ఇంకా న్యాయము జరుగలేదనే ఫిర్యాదు వస్తుందేమోనని All India Public Service Commission లోని ఇద్దరు సభ్యులలో ఒక కమిటి వేయబడింది. N. G. O. గుమాస్తాలకు అన్యాయము జరిగితే మరొక కమిటిని వేశాము. కేంద్రప్రభుత్వం డిప్యూటి సెక్రటరి లేవెల్‌లో ఒక ఆఫీసర్‌తో ఒక కమిటిని వేసింది, జరిగే అక్రమాలు చూడటానికి ఇన్ని కమిటీలు వున్నాయి.

ఏదో ఒక ఉద్యోగస్తునికి అన్యాయము జరిగినదని తెలిస్తే ఆ విషయమును రంగారెడ్డిగారిని అడిగాను. ప్రభుత్వ లెవెల్‌లో ఏమీలేదని వారు నాకు చెప్పారు. ఇక్కడ వున్న ప్రభుత్వమును బాధపెట్టాలనే వుద్దేశ్యం వుంటే నాకు అక్షేపణలేదు. కాని ఈ స్లోగన్‌ను స్వార్థ ప్రయోజనాలకు, రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగిస్తున్నారు. అది మన పిల్లలను, మనుమలను శాశ్వతంగా చీల్చి విడదీస్తుందనే సంగతిని ఎవరు మర్చిపోరాదని నేను ప్రార్థిస్తున్నాను.

వయస్సులో వారు నాతోసమానముగావున్నా అనుభవం తక్కువ. చాలా కాలము నుండి మేము తిట్లు తింటూనే వున్నాము. వారు ఇప్పుడిప్పుడే తింటున్నారు. వారు ములుకోల పత్రికను ప్రాసిక్యూట్ చేయాలని చెప్పారు. వీధిలో పోతున్న మనిషి ప్రక్కనున్న గట్టర్‌పై రాయివేస్తే అది అతని ముఖము మీదనే చిందు తుంది. ఈ విధమైన వార్తలు ప్రచురిస్తేగాని వాటి గౌరవము, ప్రతిష్ట పెరగవు. ఒకసారి కల్లూరి సుబ్బారావుగారి భార్య లేచిపోయిందని ఒక పత్రిక ప్రచురిస్తే 'నా భార్య చనిపోయి 20 సంవత్సరా లయిం'దని వారు అందరకు చెప్పుకోవలసి వచ్చింది. 10 లక్షలను మంజూరు చేసినందుకు ముందాి కేసుపై చాగ్లాను వేసి నట్లుగా, దీనిని విచారించటానికి ముగ్గురు జడ్జీలను నియమించాలి అని కూడా వ్రాసింది. నా పార్టీని, నన్ను, బలపరిచే సభ్యులేకాక అపోజిషన్ పార్టీ లీడర్స్ కూడా ఇటువంటి చార్జీలలో ఒక్క పర్సంటు అయినా నిజము వున్నదని కాని, వుండటానికి అవకాశం వున్నదని చెబితే మేము ఇక్కడ వుండనవసరంలేదు. చాగ్లా వంటి వారిని నియమించే అవసరం కూడా వుండదు. ఇటువంటి విషయములలో జాగ్రత్తగా వుండాలనే నేను భావిస్తున్నాను. ములుకోలతో సమానంగా ఉండా లనే భావంతో గాని, లేదా ఆ పత్రికను మించిపోవాలనే భావంతో గాని 'నవశక్తి' అనే పత్రిక కూడా ఇదేవిధమైన వార్తలను ప్రచురిస్తూ వుంటుంది. "ఫలానా వ్యక్తి లంచం తీసుకొన్నారు. లేదా ఫలానా ఉద్యోగి లంచం తీసుకోటానికి వీరి మద్దతు వుంది అని మేము ప్రచురించినా మాపై కేసు పెట్టరేమి?'' అని ఆ పత్రికల వారు అంటూ వుంటారు. నవశక్తి, ములకోల వంటి మురుగుపై రాయివేసి దానిని ముఖంమీద చిట్లించుకోవటం, సవాలు చేయటం అనవసరమని నేను అను కొంటున్నాను. అటువంటి పత్రికలకు ప్రోత్సాహం ఇవ్వక, ఏదైనా, ఎక్కడైనా జరిగితే అది ఇక్కడనే తెల్పాలని నేను మనవి చేస్తున్నాను.

తెలంగాణా వారికి ఈ ప్రభుత్వము ఏవో అక్రమాలు చేస్తోందని, ఉన్న ఎగ్రిమెంట్లను కాలురాచేస్తోందని కొందరు ఉపన్యాసాలలో చెప్పారు; తీర్మానాలు చేశారు. 'సంజీవరెడ్డి నియంతగా పరిపాలిస్తున్నాడు' అని కూడా వారు ప్రసంగి స్తున్నారు. గట్టిగా పరిపాలించమనే నన్ను ముఖ్యమంత్రిని చేశారు. ఒక్క కాంగ్రెస్ వారేకాక, సోషలిస్టులు, కమ్యూనిస్టులు 3 కోట్ల 30 లక్షల మంది ప్రజ ఈ రాజ్యాన్ని గట్టిగా, సమర్థతతో పరిపాలించమని నన్ను ముఖ్యమంత్రిని చేశారు. ఒక వైపుకు ఒకరు లాగితే, మరొకవైపుకు మరొకరు లాగితే ఒక వైపుకు లొంగిపోవటానికి నన్ను ఈ స్థానములో వుంచలేదు.

"బలశక్తికిగాని, ధనశక్తికిగాని సంజీవరెడ్డి లొంగడు. తాను న్యాయమను కొన్న దానిని చేస్తాడు'' అనే విశ్వాసముతోనే నన్ను ఇక్కడ వుంచారు. ఆ విధం గానే నేను వుంటున్నాను. మరి ఇంకో విధముగా ఎలా నడుచు కోవాలో నాకు

14th March, 1958]

అర్థం కావటము లేదు. గౌరవ సభ్యులు ఇచ్చిన సలహాలను నేను చేయనని చెప్ప లేదు. నే నేదైనా తప్పు చేస్తే సుందరయ్యగారు కాని, రావి నారాయణరెడ్డిగారు కాని, రత్న సభాపతిగారు కాని వేదికపైన చెప్పినా సరిదిద్దుకోటానికి నేను సిగ్గు పడను. సరిదిద్దు కోవటానికి సిద్ధంగా వున్నాను. సంతకాలకు, బెదిరింపులకు లొంగి, సరికాదని తెలిసినా కూడా అన్యాయాన్ని చేయటం కంటే ఇక్కడనుండి వెళ్ళి పోవటమే ఉత్తమ మని మనవి చేస్తున్నాను. 305 మందిలో 40 మంది సంతకాలు పెట్టినంత మాత్రమున బెదిరిపోతే నేను కాదు యింకా ఎవరైనా పరిపాలించలేరు. నిదర్శన పూర్వకంగా ఒక్క సభ్యుడు చెప్పినా, తప్పును దిద్దుకోటానికి నేను సిద్ధంగా వున్నాను.

తెలంగాణా విషయాల గురించి ఉద్యోగస్తుల గురించి నాల్గు రోజుల క్రింద తెలంగాణా మహాసభ చేసిన తీర్మానమును జాగ్రత్తగా పరిశీలించాను. తెలంగాణా ఉద్యోగస్తులకు ప్రొమోషను పోగొట్టి, ఆంధ్ర నుండి వచ్చిన వారికి ఇవ్వటం గొప్ప అని నేను భావించటం లేదు. ఏ ఉద్యోగస్తుడు పొందినా సంతోషమే. డిపార్టుమెంటులో జరిగే అవక తవకల గురించి గోపాలరెడ్డిగారు విపులముగా చెప్పారు. Sales-tax department లో జరిగాయని చెబితే ఆ డిపార్టుమెంటుకు సంబంధించిన మంత్రిగారు ½ గంట సేపు explanation ఇచ్చారు. మిగిలిన డిపార్టు మెంటులలో ఏమైనా జరిగివుంటే జరిగివుండవచ్చును. వాటిని తెల్సుకొని సరిదిద్దా లనే మా ఉద్దేశ్యము.

10 వ తేది కాబినేట్ సమావేశమైనప్పుడు ఛీఫ్ సెక్రటరి అధ్యక్షత క్రింద ఒక కమిటీని వేశాము. తెలంగాణాలో సీనియర్ అఫీసర్స్ అయిన గులాం హైదరు గారిని, గుప్తా గారిని ఆ కమిటిలో వేశాము. ప్రమోషనలోగాని, గ్రేడ్స్‌లోకాని అన్యాయము జరిగితే వారికి చెప్పుకోవచ్చును. ఇంకా న్యాయము జరుగలేదనే ఫిర్యాదు వస్తుందేమోనని All India Public Service Commission లోని ఇద్దరు సభ్యులలో ఒక కమిటి వేయబడింది. N. G. O. గుమాస్తాలకు అన్యాయము జరిగితే మరొక కమిటిని వేశాము. కేంద్రప్రభుత్వం డిప్యూటి సెక్రటరి లేవెల్‌లో ఒక ఆఫీసర్‌తో ఒక కమిటిని వేసింది, జరిగే అక్రమాలు చూడటానికి ఇన్ని కమి టీలు వున్నాయి.

ఏదో ఒక ఉద్యోగస్తునికి అన్యాయము జరిగినదని తెలిస్తే ఆ విషయమును రంగారెడ్డిగారిని అడిగాను. ప్రభుత్వ లెవెల్‌లో ఏమీలేదని వారు నాకు చెప్పారు. ఇక్కడ వున్న ప్రభుత్వమును బాధపెట్టాలనే వుద్దేశ్యం వుంటే నాకు అక్షేపణలేదు. కాని ఈ స్లోగన్‌ను స్వార్థ ప్రయోజనాలకు, రాజకీయ ప్రయోజనాలకు ఉపయో గిస్తున్నారు. అది మన పిల్లలను. మనుమలను శాశ్వతంగా చీల్చి విడదీస్తుందనే సంగతిని ఎవరు మర్చిపోరాదని నేను ప్రార్థిస్తున్నాను.

ఏమైనా లోపాలు వుంటే దిద్దుకొందామనే ఉద్దేశ్యంలో వారు చేసిన తీర్మానాలను తెప్పించాను. ఏ డిపార్టుమెంటులో ఏ లోపాలు జరుగుతున్నా గౌరవ సభ్యులు ఈ సభముందే తెలియజేస్తే నేనుసమాధానం చెబుతాను. Note చేసుకొని సమాధానాలు తెప్పిస్తాను. ఆ తెలంగాణా మహాసభ చేసిన తీర్మానాలలోని వాటికి సమాధానాలు చెప్పటానికి ప్రియత్నిస్తాను.

మొదటిది "హైదరాబాదు ప్రదేశ కాంగ్రెస్ కమిటీని రద్దు చేశాము" అని. ఇది అసెంబ్లీకి సంబంధించిన వ్యవహారంకాదు. కాంగ్రెసుకు సంబంధించిన వ్యవహారం మాత్రిమే ! ఇక్కడ చెప్పకూడనిది. అయినప్పటికీ అది మొదటి ఛార్జిగా పెట్టారు. సోషలిష్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెసువారు అందరూ కూడ ఈ వ్యవహారాన్ని తెలుసుకో వచ్చు. దీనిని ఆంధ్రులు యెవ్వరూ రుద్దలేదు. తెలంగాణా కాంగ్రెసు కమిటీవారే ఏకగ్రీవంగా తీర్మానం ప్యాసుచేస్తే రెండు కాంగ్రెసు కమిటీలను ఏకం చేయడం జరిగింది. అట్లా ఏకగ్రీవంగా ఒప్పుకొని చేసిన తరువాత యిది చార్జి క్రిందకు ఎట్లా వస్తుందో నాకు తెలియదు. ఇది బలవంతంగా రుద్దింది కాదు. రెండవది "డిప్యూటి ఛీఫ్ మినిష్టరు యిస్తామన్నారు. ఇవ్వలేద"ని. ఈ సమస్య Ministry formation కు ముందే అయిపోయింది. ఇందులో అక్రిమం యెవరు చేశారు? ఈ అగ్రిమెంటు అనేది అసెంబ్లీ ద్వారా జరిగింది కాదు. కాంగ్రెస్ పెద్దలు శ్రీ రామకృష్ణారావుగారు, రంగారెడ్డిగారు, జె. వి. నరసింగరావు గారు, చెన్నారెడ్డిగారు, ఆంధ్రుల తరఫున నేను, గోపాలరెడ్డిగారు, అల్లూరి సత్యనారాయణరాజుగారు మొదలైన పెద్దల సమక్షంలో ఈ అగ్రిమెంటు జరిగింది. డిప్యూటి ఛీఫ్ మినిష్టరుగా నేను ఒకటి రెండు ప్రభుత్వాల్లో పనిచేశాను. దాని వల్ల యెక్కువ అధికారాలు వచ్చేది ఏమీ లేదు. ఇది లేనందువల్ల వచ్చే నష్టం యేమీ లేదు. ఇది యివ్వడానికి నాకేమీ అభ్యంతరం లేదు. ఢిల్లీలో పెద్దలు "యిది యే రాష్ట్రింలోనూ లేదు. ప్రసిడెంటుగా పెట్టడం భావ్యంకాదు. అయినా మీ యిష్టం" అని అన్నారు. ఢిల్లీప్రభుత్వంలో అయినా పటేలుగారు ఉన్నప్పుడే ఉండేది. ఆయన పోయిన తరువాత మళ్ల ఆ పదవి సృష్టింపబడలేదు. ఈ విషయాలు శ్రీరామ కృష్ణారావు గారితో చెప్పాను. ఆయన "ఈ పోస్టు అనవసరం" అన్నారు. హాస్పటలులో రంగారెడ్డిగారు ఉంటే వారికి కూడా ఈ విషయాలు చెప్పాను. వారు ఆలోచించి "చేతికి ఆరవ వేళ్రిలు క్రింద ఉంటుంది ఇది నిరర్థకము" అన్నారు. శ్రీ జె. వి. నరసింగరావు గారితో చెప్పాను. అందరితో ఆలోచించే తీసివేయడం జరిగింది. ఒక రిద్దరితో యెవరితో నైనా మాట్లాడకపోతే మాట్లాడి ఉండక పోవచ్చును. అప్పటికే కత్తులు నూరుతున్నారు. "పొడుస్తాను, చంపుతాను, నువ్వు ఉండడానికి పనికిరావు" అన్నవారితో మాట్లాడి యుండకపోవచ్చును. ఇందులో

అగ్రిమెంటును కాదని చేసినది యేమీ లేదు. సంప్రదింపులలో పాల్గొన్న వారందరితో సంప్రదించి ఆ విధముగా చేయడం జరిగింది.

ఇంకొక చార్జీ యేమిటంటే "తెలంగాణా సర్వీసెస్‌లో ఉన్నవాళ్లు helpless గా ఉన్నారు. వాళ్లను క్రష్‌చేస్తున్నారు", అని ఎవరు Crush చేస్తున్నారు? ఎవరిని క్రష్‌చేస్తున్నారు? ఏ ఆఫీసులో జరుగుతోంది? ఆ విషయాలు గౌరవ సభ్యులకు తెలిస్తే మా ముందుకు యెందుకు తీసుకొనిరాలేదు? సెక్రటేరియట్‌లో యెంతమంది తెలంగాణా ఆఫీసర్లు ఉన్నారు? Heads of the Departments యెంతమంది యున్నారు? అన్న సంగతి ఒక్కసారి ఆలోచించమని కోరుతున్నాను. న్యాయంగా చూస్తే ఆంధ్ర ఆఫీసర్లు యిద్దరు ఉంటే ఒక తెలంగాణా ఆఫీసరు చొప్పున ఉండాలి. 1 : 2 Proportion లో ఉండాలి. కాని ఈ క్రింది figures ను చూచినట్లయితే మీకే తెలుస్తుంది. సెక్రటేరియట్‌లో 14గురు శక్రటరీలు ఉన్నారు. అందులో ఎనిమిదిమంది ఆంధ్రులు యుంటే ఆరుగురు తెలంగాణావారు ఉన్నారు. ఇది 1 : 2 నిష్పత్తిలో లేదే! డిప్యూటీ శక్రటరీస్ మొత్తం 29 మంది ఉంటే అందులో 12 మంది ఆంధ్రులు, 17 మంది తెలంగాణావారు ఉన్నారు ఇది 1 : 2 ప్రపోర్షన్‌లో లేదు. ఆంధ్రులు అన్నప్పుడు అందరు ఆంధ్రులు కారు. అందులో మదరాసు వారు ఉన్నారు. అరవవారు ఉన్నారు. ఇంకా అనేకమంది ఉన్నారు. Please make a note. Heads of Departments లో 35 మంది ఆంధ్రులు ఉంటే 26 మంది తెలంగాణావారు ఉన్నారు. ఇక్కడ ఆంధ్ర, తెలంగాణా ప్రపోర్షన్ అన్న మాటేలేదు. మేము ఆ నిష్పత్తిని దృష్టిలో పెట్టుకోకుండానే, సాధ్యమైనంత యెక్కువ మందిని, తెలంగాణా వారినే తీసుకోవాలని అనుకొన్నాము. అలాగే చేస్తున్నాము. నేషనలైజు చేయబడుతున్న ట్రాన్సుపోర్టు కార్పొరేషన్‌కు,-తెలంగాణా సెంటిమెంటు effect కాకుండా, ఆపరేటివ్ డైరెక్టరుగా తెలంగాణావారినే నియమించాము. ఇట్లా ఉన్నప్పుడు అక్రమం జరుగుతున్నది అనడానికి బదులు, నిదర్శన ప్రకారంగా ఒక instance ను చూపించమని కోరుతున్నాను. "సీనియర్సును తీసివేసి, జూనియర్స్‌కు స్థానం యిస్తున్నారు" అంటున్నారు. ఒకవేళ ఆ ఉద్యోగస్థుడు అసమర్థుడైతే తప్ప - ఆయన తెలంగాణా వారు కానియండి, ఆంధ్ర వారు కానీయండి-అటువంటి సందర్భాలు ఉన్నప్పుడు ప్రభుత్వదృష్టికి తెమ్మనమని కోరుతున్నాను. అసమర్థతల విషయంలో ఎవరూ యేమి అనరని అనుకొంటాను. అట్లా కాకుండా, ఆ ఉద్యోగస్థుడు తనకు అక్రమం జరిగిందని యే పొలిటీషియన్ దగ్గరకోపోయి చెప్పుకోవడం ప్రారంభిస్తే డిసిప్లిన్ యెక్కడ ఉంటుంది? ఈ పరిపాలన యంత్రాన్ని ఎట్లాగ నడపడం అన్నది ఆలోచించమని మనవిచేస్తున్నాను. ఈ నాడు ఈ ప్రభుత్వం కాకపోతే యింకొక ప్రభుత్వం వస్తుంది. ఈ పార్టీకాకపోతే యింకో పార్టీ అధికారంలోకి రావచ్చు

ఇటువంటి అలవాటుచేస్తే యేపార్టీ అయినా యెట్లా ప్రభుత్వాన్ని నడుపుతుంది? ఎట్లా రాజ్యాంగాన్ని నడుపుతుంది? ఇది మాత్రం మంచి పద్ధతి కాదని చెప్పుతున్నాను.

నాల్గవ నేరం "నియంతలాగ ప్రవర్తిస్తున్నానని". రీజనబుల్ గా, యెవరైనా, ఏ దైన-న్యాయమైన విషయం చెప్పినప్పుడు నేను వినకపోతే "ముఖ్యమంత్రి నియంతగా ప్రవర్తిస్తున్నాడు" అనవచ్చు. నేను నమ్మని దానిని, అన్యాయమైన విషయమని గ్రహించిన దానిని, బలవంతంగా లొంగదీసి చెయ్యమంటే ఎట్లాగ చెయ్యడం? ఒక పిస్టల్ తీసుకొని "కాలుస్తాను, చేస్తావా చెయ్యవా"అని ఈ సంజీవరెడ్డిని లొంగదీయడానికి ప్రయత్నంచేస్తే మాత్రం, అది యెన్నటికి జరుగదని మిత్రులకు మనవిచేస్తున్నాను. ఇలాంటి బెదరింపులకు లొంగితే రాజ్యాన్ని ఎన్నాళ్లు పరిపాలించడం? ఏదో వారపత్రిక, పెద్ద పత్రిక కాదు, "అయిపోయింది. సంజీవరెడ్డి ప్రభుత్వం పడిపోయింది" అని వ్రాస్తే పడిపోయే ప్రభుత్వంకాదు. సెడాన్ కార్లలో నలుగు రైదుగురు తిరుగుతూ, కొంత మంది ధనవంతుల అండతో యేవో నాలుగు మాటలు వ్రాస్తే పడిపోయే ప్రభుత్వం మాత్రంకాదు. సంజీవరెడ్డి ప్రభుత్వానికి ఈ నాడు ప్రజల అండ, శాసన సభ్యుల అండ బాగా యున్నదని చెబుతున్నాను. (హర్షధ్వనాలు).

"It is alleged that the Telangana Persons who are in key-posts of administration had been replaced by Andhra officials." ఆ key-posts ఏమిటి? ఎవరిని తొలగించి ఎవరిని వేశారు? అన్న information యివ్వకుండా తొలగించారు అంటే అర్థంలేదని, మనవిచేస్తున్నాను. కరెక్టు ఆఫీసర్లు యెవరైనా ఉంటే-ఒక వేళ అట్లా జరుగుతే అన్ని పార్టీలు అంగరూ హర్షించాలి. తెలంగాణా ఆఫీసర్లలో కూడ మంచివారు సమర్థులు, తెలివైన వారున్నారు. అందుకే అన్ని Key-Posts ల్లో వారిని ఉంచడం జరిగింది. కేవలం వారు తెలంగాణా వారని ఆ ఉద్యోగాలు యివ్వబడలేదు. వారి సామర్థ్యాన్నిబట్టి యిచ్చారు. ఒక వేళ అటువంటి అన్యాయాలు జరుగుతోంటే ఎక్కడో కాదు-ఈ సభా వేదికపైనే మనవి చేయమని మిత్రులకు మనవి చేస్తున్నాను.

నిన్న తెలంగాణా సమావేశాలకు వెళ్లిన కొందరు మిత్రులను అభినందిస్తున్నాను. ఉద్రేకమైనటువంటి వాతావరణంలో కూడ, నిజాయితీని గ్రహించి, Balance ను తేవడానికి కొంతమంది మిత్రులు ప్రయత్నం చేశారు. వారిని తప్పకుండా అభినందించాలి. అందులో ముఖ్యులు శ్రీ కందుల ఓబులరెడ్డిగారు. "ఉద్రేకాలను రెచ్చకొట్టుట తప్పు. అది ఎవరికి మంచిదికాదు. తప్పులుఉంటే సరిదిద్దేటట్లు ప్రయత్నం చేద్దాం" అని శ్రీ ఓబులరెడ్డిగారు అంటూన్నప్పుడు - Down! Down! అని కేకలు వేశారు. అయినప్పటికీ realistic గా ఆ సమయంలో వార్ధు

చెప్పినందుకు మరల వారిని అభినందిస్తున్నాను. అట్లాగే శ్రీ రాజబహద్దూర్ గౌడు గారు కూడ "క్రాంకిట్ ఇన్‌స్టెన్సెస్ యేమైనా ఉంటే ప్రభుత్వం దగ్గరకు తీసుకొని వెడదాం, ఇట్లా ప్రజలను రెచ్చగొట్టడం మంచిది కాదని" చెప్పారు. వారిని కూడ అభినందిస్తున్నాను.

ఇది ఒక పార్టీకి సంబంధించిన విషయం కాదు. ఈ ఆంధ్ర, తెలంగాణా అనే విషయం దేశానికంతకు సంబంధించినది. రెండు కోట్ల చిల్లర అటు, ఒక కోటి పది లక్షలమంది ఇటు ఉన్న ఆంధ్రుల సమస్య ఇది. దీనిని ఒక group లేక ఒక పార్టీగా చూడడంమాత్రం న్యాయం కాదని నేను మనవి చేస్తున్నాను. లోపాలు లేవని నేను చెప్పను. అటువంటివి ఎక్కడైనా వుంటే నేను సర్దుబాటు చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నానని చెబుతున్నాను. అధ్యక్షా! నాతరఫున కాదు, ప్రభుత్వం తరఫున చెబుతున్నాను. Lower levels లో ఎక్కడైనా గుమాస్తాల promotoins లోనో, లేక మరెక్కడికైనా మార్చడంలోనో ఏమైనా లోపాలు జరిగి ఉండవచ్చు. వీటిల్లోకూడా seniority, merit ను overlook చేసిన instances కూడా వుండవు. క్రొత్తగా ఖాళీలు వచ్చి, వాటిని భర్తీచేసేటప్పుడు 3 vacancies లో ఒక vacancy తెలంగాణావారికి ఇచ్చి తీరాలని చట్టంకూడా చేశాం. ఆంధ్రలో మెరిట్ ఉన్నవారు, M. A. 1st class లో pass అయినవారు ఉన్నప్పటికీ వారిని గమనించవలసిన అవసరం లేదు. తెలంగాణావారిలో best manకు "out of every three vacancies, one vacancy should be given" అనే ఆదేశాలు ఇచ్చాము. ఆ విధంగా నేడు నడుస్తోంది. Services integration చిక్కు సమస్యలను తెచ్చిపెడుతోంది. ప్రతివారూకూడా తమ సీనియారిటీని fix చేయడంలో అన్యాయం జరిగిందని చెబుతున్నారు. ఈ విషయం విచారణ చేయడానికి Secretariat లో ప్రతి Department లోను ఒక ఆంధ్ర, ఒక తెలంగాణా అధికారులతో కమిటీలు ఏర్పాటుచేశాం. తరువాత మళ్ళీ ప్రత్యేకంగా తెలంగాణాకు ఒక కమిటీని ఏర్పాటుచేశాము. ఇంకా All India Committees రెండున్నాయి. State services వారి క్రింది ఉద్యోగులకోసం రెండు కమిటీలున్నాయి. ఇంతమంది జాగ్రత్తగా పరిశీలనలు చేస్తున్నప్పుడు క్రింది ఉద్యోగస్తులకుకూడా అక్రమం జరగడానికి వీల్లేదు. ఏ ఉద్యోగస్థుడో అతనికి ఆప్తులుగా ఉండేవారిని promote చేస్తున్నాడనే విషయం నా దృష్టికి రాలేదు. శ్రీ రంగారెడ్డి 1, 2 విషయాలు నా దృష్టికి తెస్తే వెంటనే సరిచేశాము. వారుకూడా సంతోషించారు. ఎక్కడో ఒక అధికారి "arrogant" గా ప్రవర్తిస్తున్నాడని, తమతో, అమర్యాదగా మాట్లాడుతున్నాడనే ఫిర్యాదు ఒకటి ఉంది. కొందరు మిత్రులు దానిని గురించి నాకు చెప్పారు. రంగారెడ్డిగారుకూడా నా దృష్టికి తెచ్చారు. స్వభావసిద్ధంగా కొందరి భాషలో భేదం ఉండవచ్చు. వాడే మాటల్లో కొంత కాఠిన్యం

ఉండవచ్చు. పై ఆఫీసరు administration లో క్రిందివారిని మందలించే సందర్భంలో కఠినమైన మాటలు వాడతారు. అది ఉద్యోగ నిర్వహణలో జరిగిందేకాని ఇంకో రకమైనది కాదు. నేను ఆఫీసరును పిలిచి మాట్లాడాను. ఇక ముందు ఆ విధంగా కఠినమైన పదాలు జాబుల్లోకాని, మాటల్లోకాని వాడవద్దని వారికి సలహా ఇచ్చాను. అన్నిటికన్నా యిబ్బంది కలుగుతున్న విషయం ఒకటి ఉంది. పై ఉద్యోగానికి ప్రమోషన్ చేసినప్పుడు తెలంగాణాలో ప్రొబేషన్ అనేది లేదు. ఆంధ్రలో టెంపరరీగా ప్రమోషన్ యిచ్చినా, ప్రొబేషన్ అనేది వుంది. అంటే ఆ ప్రొబేషనర్ ఎప్పుడైనా revert అయినా, మళ్ళీ అతనికి ఆ ఉద్యోగం ఇవ్వాలి. అతనిని over look చేసి ఇంకొకరిని promote చేయడానికి వీల్లేదు. తెలంగాణాలో ఆ పద్ధతి లేకపోవుటచే కొంత యిబ్బంది కలుగుతోంది. ఆంధ్రా officers కు ఈ probationary right ఉన్నాసరే, మళ్ళీ promote చేయవలసిన అవసరంఉన్నాసరే, promotions question వచ్చినపుడు ప్రతి మూడింటిలోను ఒక తెలంగాణా officer ను ప్రమోటుచేయ్యాలనే నిర్ణయానికి వచ్చి ప్రభుత్వం ఆ ప్రకారంగా ప్రవర్తిస్తున్నది. ఇక్కడ Services లో Backward classes కు reservation లేదు. General గా select చేయడమే జరుగుతోంది. ఆంధ్రాలో వారికి 25% reservation ఉంది. దానినే ఇక్కడకుకూడా extend చేశాము. ఇలా చేయడం కూడా తప్పంటున్నారేమో నాకు అర్థంకావడంలేదు. ఈలాంటి చిన్న చిన్న వ్యవహారాలు, ఉద్యోగస్థులకు సంబంధించినవి చెబుతున్నారు. తెలంగాణాలో ఖర్చుపెట్టవలసిన రెండుకోట్ల రూపాయలను ఖర్చుపెట్టలేదనియు, దానిని ఆంధ్రలో ఖర్చుపెట్టుకోవడానికి ప్రయత్నం చేస్తున్నారని కొందరు చెప్పారు. Budget లో short falls వుంటాయి. ఆంధ్రలోకూడా short falls ఉన్నాయి. కొన్ని, కొన్ని departments కు కేటాయించిన మొత్తాలను అవి ఖర్చుచేయలేకపోతున్నాయి. మరి కొన్ని departments లో—Electricity and Irrigation—వాటికి allot చేసినదానికన్నా హెచ్చుగా ఖర్చుచేస్తున్నాయి. ఈ రెండు శాఖలు ప్రతి సంవత్సరం రు. 40, 50 లక్షలు హెచ్చు ఖర్చుచేస్తున్నాయి. మద్రాసు ప్రభుత్వం నుంచి మేము విడిపోయినప్పుడు, రెండు సంవత్సరాలు మద్రాసు ప్రభుత్వంలో ఖర్చుపెట్టకుండా వున్న డబ్బునంతా తరువాత రెండు సంవత్సరాల్లోను ఖర్చుపెట్టడమైంది. వాటికి allot చేసిన సొమ్ముకన్నా ఎక్కువే ఖర్చుపెట్టారు. కానీ కొన్ని departments లో ఏమైనా matching contributions పల్లెలనుంచి రావలసివచ్చినపుడు కాని, లేకపోతే ఏదైన seed farm ఏర్పాటు చేయడంలోగాని కొంత ఆలస్యం అవుతుంది. ఇలాంటివి జరగడంవల్ల వీటికి allot చేసిన డబ్బు ఆ సంవత్సరంలో ఖర్చుకాకపోవచ్చు. ఈ సొమ్ము వచ్చే సంవత్సరం ఖర్చుచేయడం జరుగుతుంది. ఆ విధంగా తెలంగాణాకు allot చేసిన

డబ్బులో రూ. 2 కోట్లు మిగిలింది. ఈ డబ్బు వచ్చే సంవత్సరం తెలంగాణాకే ఖర్చు పెడతాము కానీ దానిని తీసుకుపోయి ఆంధ్రలో ఖర్చుపెట్టే ఉద్దేశ్యం ఎంత మాత్రం లేదు. ఆ విధంగా తెలంగాణా డబ్బు ఖర్చుపెట్టమని మరొకమారు హామీ ఇస్తున్నాను.

విశాలాంధ్ర ఏర్పడడానికి కొద్ది నెలలకు పూర్వమే తెలంగాణా ప్రతి జిల్లాలోను ఒక కళాశాలను ప్రారంభించారు. అందుకు వారిని నేను అభినందిస్తున్నాను ఎప్పుడైనా, ఏ కార్యక్రమాన్నయినా డబ్బు గురించి ఆలోచించకుండా ధైర్య సాహసాలతో ప్రారంభించినవే బాగా జయప్రదంగా జరుగుతాయని నా విశ్వాసం. Building లేక పోయినా, సరైన staff లేక పోయినా, అక్కడ కనీసం సరైన బోర్డు తగిలించు కోవడానికి చోటు లేకపోయినా కళాశాలలను స్థాపించారు. చాలా సంతోషం. బ్రహ్మాండమైన పని చేశారు. అప్పుడు వారు ఒక్కొక్క కళాశాలకు రు. 50 వేల నుంచి ఒక లక్షవరకు డబ్బు ఇచ్చారు. వారు allot చేసిన సొమ్ములో, ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత, ఒక్క అణా తగ్గించడం కానీ, వారి ఉత్తరువుకు కామా పెట్టడం కానీ ఎక్కడా జరగలేదు. కళాశాలలకు యింకో రు. 4 లక్షలు ఎక్కువ కావాలంటే అడగండి సంతోషంగా ఇస్తాము. అంతేకానీ ఇచ్చే గ్రాంట్లును నిలిపివేశామని గానీ, కట్టిన బోర్డులను తిప్పేశామనిగానీ ఉన్న గోడలను కూల్చామనిగానీ అనవసరమైన నిందారోపణలు చేయడం మంచిదికాదని చెబుతున్నాను.

వరంగల్‌లో వున్న ఆయుర్వేద కాలేజీకి జిల్లా బోర్డువారు ఇస్తానన్న రు. 15 వేలు మేము ఆపివేశామనే ఆరోపణ ఒకటి ఉంది. దానిని మేము నిలిపి వేయలేదు. ఈ విషయాన్ని గురించి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారే కాదు, నేను కూడా papers తెప్పించి బాగా చూశాను. ఈకళాశాలకు ఆ రూపాయలు 15 వేల ఎంత ఉపయోగ పడుతుందో తెలిసికొని రమ్మని Special Officer ను పంపాము. వరకు వారుతమ reportలో, జిల్లాబోర్డు ఇస్తానన్నా రూ. 15 వేలు చాలదు. ఇప్పుడు వెంటనే రు. 60 వేలు కావాలి. తరువాత "రికరింగ్ ఎక్సుపెండిచర్" సంవత్సరానికి రు. 10 నుంచి 19 వేల వరకు కావాలని వ్రాశారు. జిల్లాబోర్డ్సు కళాశాలలకు డబ్బు ఇచ్చే పద్ధతి చాలా పొరపాటని నా ఉద్దేశ్యం. మేము దీనిని ఎక్కడా కూడా allow చేయలేదు. నిన్న కొంత మంది చిత్తూరు మిత్రులు వచ్చి మేము కాలేజీని ఏర్పాటు చేస్తే జిల్లాబోర్డువారు రెండు లక్షల రూపాయలు ఇస్తామన్నారనియు ప్రభుత్వాన్నికూడా సహాయం చేయమని కోరారు శ్రీ చెంగల్ రాయనాయుడు, శ్రీ రామకృష్ణరాజు ఈ కాలేజీకి తప్పకుండా సహాయము చేయమని చెప్పారు. జిల్లాబోర్డు ఇస్తామన్న డబ్బు ఈ కాలేజీ ప్రారంభోత్సవానికి వచ్చే పెద్దవారి receptions కు సరిపోతుందని నేను వారికి నచ్చచెప్పాను. ఈనాడు

పల్లెల్లో నూతులు లేవు, శుభ్రతలేదు, లైట్లు లేవు. ఇట్లాంటి పనులెన్నో జిల్లా బోర్డులు చేయవలసి వుండగా, అవి మానివేసి, కాలేజీలకు డబ్బు ఇస్తామని ముందుకు రావడం మంచిదికాదు. అవి చేయవలసిన పనులను సక్రమంగా నెరవేర్చాక ఇతర వాటికి సహాయం చేస్తే నాకు అభ్యంతరం లేదు. చిత్తూరునుంచి వచ్చిన మిత్రులకు ఇదే సలహా ఇచ్చాను. ఇక్కడ కూడా ఆలాంటి సలహా చెబితే, "హైదరాబాదు ప్రభుత్వం sanction చేసిన దానిని వీరు వద్దంటున్నారని" ఎక్కడ తెలంగాణా slogan లేవ తీస్తారో అన్న భయంతో ముందుగానే జాగ్రత్తకోసం Special Oficer ను పంపించాము.

15 వేల రూపాయలు ఏమాత్రము చాలదు. 60 వేల రూపాయలు ఇప్పుడు వెంటనే ఇయ్యాలి. అంతేకాకుండ ప్రతి సంవత్సరం 19 వేలు ఇస్తుండాలి. అప్పుడుగాని అది ఒక కళాశాలగా నిలబడదు. దీని విషయమై ఇంకా ఏలాంటి decision తీసుకోలేదు. కాని మీ అందరి అభిప్రాయము ఈ 60 వేల రూపాయలు అక్కడనే ఇయ్యాలంటే ఇక్కడ ఉన్న ఆయుర్వేద, కళాశాలకు allot చేసిన మొత్తంలో ఇంకో 2 లక్షల రూపాయలు అక్కడకు ఇస్తాము. లేదా ఇంకొక fund నుంచి తీసి ఇవ్వమంటె ఇస్తాము. నాకు ఆక్షేపణ ఏమీ ఉండదు. ఇక్కడ ఉన్న ఆయుర్వేద కళాశాలను బ్రహ్మాండంగా develop చెయ్యవలసి ఉన్నది. Staff, Medicines, Beds, వగైరాలపై ఎన్నో లక్షలు ఖర్చుపెట్టవలసి ఉన్నది. దానికొరకై fresh గా amounts allot చేస్తున్నాము. అంధ్రదేశంలో ఎక్కడా ఇటువంటి కళాశాల లేదని మొన్న నేను Bezwada కు వెళ్లినప్పుడు ఎవరో చెబితే, రాష్ట్రం మొత్తానికి హైద్రాబాదులో ఒకటి ఉన్నది. దానికే ఇంకా ఎక్కువగా ఖర్చుబెట్టి అభివృద్ధి చేసుకుందామని వారితో చెప్పాను. ప్రస్తుతము వరంగల్ లో ఉన్నది private కళాశాల. అయినప్పటికి దానికి 15 వేల రూపాయలు ఇవ్వడానికి నాకు ఎట్టి ఆక్షేపణ లేదు. అంతేకాకుండ, ఆంధ్రదేశంలో ఉన్న ప్రజానీకానికి ఇది ఎక్కువగా ఉపయోగపడుతుంది అంటే, 80 వేల వరకు ఇవ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

ఇక, వరంగల్ లో Engineering కళాశాల నెలకొల్పే సందర్భంలో జరుగుతున్న బ్రహ్మాండమైన ఆందోళనపై, రంగారెడ్డిగారు ఒక చిన్న రహస్యాన్ని కనిపెట్టి నిన్న నాతో చెప్పారు.

"ఏమిటి వీళ్లంతా, Central Government Grant ఇచ్చే కళాశాల కావాలని కోరుతున్నారు. ఎంతోమంది శాసనసభ్యులు కూడ దానిని బలపరుస్తూ memorandum లో సంతకాలు పెట్టారు. అటువంటప్పుడు Mysore, Madras, Tirupati, Vishakapatnam, Kerala ల నుంచి వచ్చిన విద్యార్థులను తప్పని

సరిగా admit చేసుకోక తప్పదు, కాబట్టి ఈ రహస్యాన్ని తెలుసుకోకుండా పిచ్చి పిచ్చిగా వ్యవహరిస్తున్నారని", నిన్ననే రంగారెడ్డిగారు నాతో చెప్పారు.

విద్యార్థులు, శాసనసభ్యులు కోరుతున్నారు కాబట్టి, కేంద్ర ప్రభుత్వంవారు వరంగల్‌లో ఈ కళాశాలను స్థాపించడానికి ఒప్పుకుంటే ఈ ప్రభుత్వానికి ఎట్టి ఆక్షేపణ ఉండదు. తప్పకుండా అక్కడ నెలకొల్పుతామని, వారికి నేనుచెప్పాను. ఇక రాష్ట్రప్రభుత్వం పెట్టదలచుకున్న కళాశాలను ఏ తిరుపతిలోనో, ఎక్కడో పెట్టుకుందాము. దీనికి ఏమీ అడ్డులేదు. తరువాత మళ్లీ మనసు మార్చుకొని ఈ Central institution ను వరంగల్‌లో పెట్టడానికి మేము ఒప్పుకోము, దీనినే ఇంకెక్కడైనా పెట్టుకోండిఅంటే, నేను అంగీకరించనని వారికి, చెప్పాను.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి:- అధ్యక్షా, అసలు ఈ కళాశాల మన South లోనే లేకుండా, North కు పోతుందేమో చూచుకోండి.

శ్రీ ఎన్. సంజీవరెడ్డి:—ఇంతకు ముందు Higher Technology Institute అదేవిధంగ పోయింది. అప్పటికి ఆంధ్రప్రదేశ్ ఏర్పడలేదు. ఇది హైదరాబాదులో ఉండాలని, ఆంధ్రలో ఉండాలని, ఈ రకంగా వాదించుకోవడంతో అది కాస్తా Madras కు పోయింది. కాని ఆంధ్రప్రదేశ్ ఏర్పడగానే, ఈ విషయమై నెహ్రూ గారితో, ఆజాద్ గారితో Special గా interview చేసి, దక్షిణ భారతంలో హైదరాబాదు Centre. కావున ఈ Higher Technological Institute ఇక్కడ నెలకొల్పండని, అందు గురించి, Secunderabad లో ఉన్న యీ Engineering College ను పూర్తిగా మీకు అప్పగిస్తామని, ఇంకా కావలసివస్తే లక్షలకొలది విలువగల భవనాలుఇస్తామనికూడ చెప్పాము. Madrasలో ఇచ్చేది వాళ్లు వట్టిబీడు భూమి తప్ప ఒక్క అణాఎత్తు ఆస్తి ఇయ్యలేదని చెప్పాను. కాని నెహ్రూ గారు ఇదంతా విని, బాగానే ఉందిగాని, it is too late అని అన్నారు.

ముఖ్యంగా ఇలాంటివి ఎక్కడ పెట్టినాసరే మన పిల్లలకు, అన్ని రాష్ట్రాల వారి పిల్లలకు, ముఖ్యంగా దక్షిణ దేశంలో ఉన్నవారికి ఉపయోగపడుతవి. ఏమైనాసరే మీకు Engineering College కావాలి, అది వరంగల్‌లోనే ఉండాలనీ, కొందరు విద్యార్థులు నా దగ్గరకు వచ్చారు. ఏదో ఒక memorandum కూడ ఇచ్చారు. దానిలో కొంత మంది శాసన సభ్యులు కూడ సంతకాలు పెట్టారు. బహుశః వారికి తెలియక పెట్టారని అనుకుంటున్నాను. ఈ సంగతి నాకు చెప్పిఉంటే, నేను ముందే అంగీకరించి ఉండే వాడిని. ఏమైనప్పటికీ ఇప్పుడు అంగీకరించాను. చాల సంతోషం. కాబట్టి దీనిని గురించి ఇప్పుడు ఎవరైనాసరే ఆక్షేపణ తెలపడానికి వీలులేదు. ఈ విషయమై పట్టాభి రామారావుగారు కేంద్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపుతారు. తెలంగాణా మిత్రుల యొక్క కోర్కె

యని, ఇందు గురించి, ఆంధ్ర రాష్ట్రంలో ఉన్నవారికి ఎట్టి ఆక్షేపణా లేదనికూడ తెలియజేస్తాము. దానిని నెలకొల్పే stage వచ్చినప్పుడు, ఇక్కడనే పెడతాము.

శ్రీ కొండా లక్ష్మన్ బాపూజీ:-అధ్యక్షా! అది Central Institution కాక పోతే, State ఎప్పుడు పెట్టదలచు కుంటుంది?

శ్రీ యన్. సంజీవరెడ్డి :-June లో పెట్టాలని అనుకున్నాము. State Institution తక్కువని, Central Institution హెచ్చని ఎందుకు అనుకుంటున్నారో తెలియడం లేదు. State Government పెట్టే Engineering కళాశాలలు ఒట్టి దిష్టిబొమ్మలని అనుకోవడం చాలపొరపాటు. Kurnoolలో Medical College ప్రారంభించాము. దానికి కేంద్ర ప్రభుత్వం ఋణసహాయం చెయ్యలేదు. అయినప్పటికి వారు ఎంత డబ్బు ఇయ్యదలచుకున్నారో, అంతా మొదలే, అక్కడ ఉన్న Laboratories వగైరాలకు ఖర్చు పెట్టాము. మొన్ననే Karmarkar గారు వచ్చినప్పుడు దానిని చూచి, కొన్ని లక్షల రూపాయలు దానికి గాను వెంటనే మంజూరు చేశారు.

శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ (చిన్న కొండూరు) :- అధ్యక్షా! Central Institution వద్దు. ఇక్కడ State Institution కావాలని కోరితే ఈ June లోనే పెడతారా?

శ్రీ ఎన్. సంజీవరెడ్డి :- మళ్లీ అన్ని సంతకాలతో వస్తే ఆలోచిస్తాము (Laughter). తప్పకుండా చూస్తాము. ఇది మనకుగానే పెట్టుకుంటున్నాము కాబట్టి, వారు చెప్పినా చెప్పకపోయినా మనం పెట్టవలసిందే. Warangal లో పెట్టినంత మాత్రాన, Warangal పిల్లలే గాక, మొత్తం తెలంగాణా పిల్లలందరూ వృద్ధిపొందుతారు. శిక్షణపొంది ఎక్కడికో పోరు. ఇక్కడ మనం కట్టే Projects కు, Bridges కు, Buildings కు, అన్నింటికి వీళ్లే అధిపతులుగా ఉండి, మనకార్యక్రమాలను జరుపుతారు. దేశసౌభాగ్యానికి కృషి చేస్తారు.

రెండవ విషయం ఏమంటే, ఈ ఊరిలో ఒక orphanage ఉన్నది. ప్రతి సంవత్సరము పిల్లలను చేర్చుకోవడానికిగాను, దానినిగురించి Budget లో కొంత amount allot చేస్తున్నాము. ఒక్క అణా తగ్గించడంగాని, హెచ్చించడంగాని చెయ్యలేదు. Orphanage ను తగ్గించారని, కొంత మందిని, పంపించారని ఒక ప్రచారం సాగుతున్నది. ఈ విషయమై నేను, పట్టాభి రామారావుగారు, మెహెది నవాజ్ జంగ్ గారు మాట్లాడుతూ, కొత్త orphans ను తీసుకోవడానికి వీలులేక పోతున్నదని, ప్రస్తుతం దానికి allotment తక్కువగా ఉన్నది కాబట్టి increase చెయ్యవలసి ఉంటుందని మెహెది నవాజ్ జంగ్ గారు చెప్పారు.

Allotment increase చేసే ముందు అక్కడ ఉన్న లోపాలను సవరించవలసిన అవసరం ఉన్నది. సాధారణంగా orphanages లో చిన్న చిన్న పిల్లలను

14th March, 1958]

చేర్చుకొని వారికి ఏదో వృత్తి కల్పించి, పెద్దవాళ్ళు అయి 18 ఏళ్ళు వయస్సు రాగానే వాళ్ళనుపంపించి, వారిస్థలంలో ఇంకాకొంతమందిపిల్లలనుచేర్చుకుంటారు. కాని ఈ orphanages లో ఈ విధంగా లేదు. వాళ్ళకు ఎంత వయస్సు వచ్చినా వాళ్లను orphans గానే అక్కడ ఉంచుకొంటారు. వీళ్ళను న్యాయరీత్యా పంపిస్తే తెలంగాణా వాళ్ళను బయటకు పంపించారని అంటారేమో అనే భయం ఒకటి ఉన్నది. వయసు వచ్చిన వాళ్ళను బయటకు పంపితే ఆ స్థలంలో చిన్న వాళ్ళను చేర్చుకోవడానికి వీలు అవుతుంది. అలాంటి వాళ్ళను orphans గా ఉంచడం న్యాయంకాదు. కూలీ చేసుకొనే వయస్సు వచ్చింది కాబట్టి, వాళ్లను feed చెయ్యడం న్యాయం కాదు. ప్రజల డబ్బు ప్రభుత్వము డబ్బు పాడుచేసినట్లు అవుతుంది. అందువల్ల వయసు వచ్చిన వారిని పంపించి, కొత్తవాళ్ళను చేర్చుకోవాలి. ఆ చేర్చుకున్నవాడు కూడ తెలంగాణావాడై ఉంటాడు. పట్టాభి రామారావుగారు ఎక్కడనుంచో East Godavari నుంచి తెచ్చి చేర్పించరు ఈ orphanage విషయంలో నిన్ననే నాకు తెలిసింది. ఇంతకు ముందు ఎవరైనా చెప్పి ఉంటే మేమందరమూ ఇప్పటికే పరిశీలన చేసి ఉండేవాళ్ళము.

లోపాలు ఎక్కడా లేవనికాదు. అన్ని చోట్ల లోపాలు ఉండవచ్చు. తెలంగాణా విషయాలలో ఉండవచ్చు, ఆంధ్ర విషయంలో ఉండవచ్చు. Promotion లలో గానీ, ఖర్చుపెట్టే విధానంలోగాని, Projectes ల విషయంలోగాని లోపాలు ఉండవచ్చు. లోపాలు ఉన్నాయని చెప్పడంవల్ల లోపాలు తీరిపోవు. లేక అక్రమంగా జరుగుతున్నాయని గట్టిగా ఉపన్యాసాలు ఇచ్చినందువల్ల తీరిపోవు. ఏదైనా ఉంటే నాకో, మిగిలిన మంత్రులకో, తెలిపితే, విచారించడానికి వీలు అవుతుంది. అక్రమాలు జరుగుతున్నట్లు మాకుకూడ తెలుస్తుంది. ఇక్కడ శాసనసభలో Specificగా ఏదైనా ఉంటే దానిని చెబితే చాలసంతోషిస్తాను. లేకపోతే, ఏదో "ములుకోల" level లో గాని, లేక "నవశక్తి"leval లో గాని పోవడం మంచిదికాదు, ఏదైనా ఉంటే మనం సమాధానం చెప్పవలసింది ఇక్కడ మన మిత్రులకు, లేక ఇక్కడ ఉన్న పెద్దలకు. వీరు ఏదైనా charge చేస్తే, సమాధానమే కాకుండ, మనం బయటకు వెళ్ళిపోవాలి. "We must get out." సమాధానం చెప్పేవరకు ఉండవలసిన అవసరం లేదు. అంతేగాని, ఈ "ములకోల" లేక "నవశక్తికి, సమాధానం చెప్పడం, court కు పోవడం ఏమీ లాభం లేదు.

ఏదో కొన్ని చిలిపి వ్రాతలపై వీరి మీద case పెట్టాలని జె. వి. నరసింగ రావుగారు అడుగు తున్నారు. వద్దని నేను restrain చేస్తున్నాను. ఇప్పుడు వాళ్లకు court కు వెళ్ళడమే కావాలి. సంజీవరెడ్డి case పెట్టాడని Hindu paper కూడ "ములకోల" పేరు అచ్చువేస్తుంది.

శ్రీ కె. సుబ్బారావు (హిందుపూరు-జనరల్).- అధ్యక్షా ! సభలో వారి పేర్లు చెప్పడంవల్ల, అంతకంటే ఎక్కువగా ప్రచారం జరగడంలేదా?

శ్రీ ఎన్. సంజీవరెడ్డి:- అది కూడ నిజమే అనుకుంటాను. ఈ సభలో పేర్లు చెప్పడంవల్ల కూడ వారికి ఎక్కువ importanee ఇస్తున్నానని నేను అనుకోనను; ఏదో case పెట్టాలని వారు అంటుంటే, case ఎందుకు, ఇంతలోనే చాలిద్దామని చెబుతున్నాను.

అలాంటి level కాకుండా high level లో సలహాలియ్యాలని ఏవయినా లోపాలుంటే చెప్పాలని కోరుతున్నాను. Instances వుంటే చెప్పమనండి. కాని వారి దృష్టికివచ్చిన దృష్టాంతములన్ని సరియైనవని అనుకోకండి. వారు చెప్పిన వాటిని పరిశీలిస్తాము. అందులో నిజము లేకపోతే తెలుపుతాము. I am prepared to enquire into any individual instance if they are brought to my notice. Not only that. I will let him know later on. వాటిగురించి అందరమూ కలిసి మాట్లాడుకుందాము. ఏదయినా లోపముంటే సరిదిద్దుతాము. దేశం ఐకమత్యతకోసం అందరమూ గట్టిగా ప్రయత్నం చేయాలి. తెలంగాణా ప్రత్యేకం అనేది పోవాలి. తెలంగాణా అభివృద్ధి అయినప్పుడు దేశం అంతా బాగుపడుతుంది. శరీరంలో ఒక అంగం జబ్బుతో కుళ్లిపోతే ఆ శరీరం ఆరోగ్యం వుందనుకోడానికి వీలులేదు. అదేవిధముగా దేశంలో ఒక భాగం బాగులేకపోతే దేశానికి క్షేమంకాదు. అంతా బాగుపడాలి. తెలంగాణా ప్రత్యేకంగా బాగుపడాలి. తెలంగాణా రాయలసీమ కోస్తా జిల్లా అన్నీ కలిసి ఆంధ్రదేశమవుతుంది. ఈ issue పైన ఏకైక దృక్పథంతో గట్టిగా పని చేయాలని అర్థిస్తున్నాను. దీనిని దృష్టిలో పెట్టుకుని సలహా లివ్వండి. మనకు రెండు రోజులు అవకాశం వుంది. జాగ్రత్తగా వింటాను. ఉద్యోగు లిక్కడనే వున్నారు, వారు చెప్పినవి పరిశీలన చేస్తారు. ఈ డిమాండును బలపరచాలని కోరుతున్నాను.

## DEMAND No. X — *Heads of State Rs. 1,14,16,100 Ministers and Headquarters Staff.*

*Sri Vavilala Gopalakrishnayya (Sattenapalli)* : I beg to move :

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100
మంత్రుల జీతాలు రు. 500 కు తగ్గించుకోనందులకు

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

14th March, 1958]

ఆర్థికమంత్రి బడ్జటు ఉపన్యాసంలో చెప్పినట్లు హైదరాబాదులో వారికి 13 రూపాయలు, బయట జిల్లాలతో ఉన్నవారికి 12 రూ. ల రూ. 100 తక్కువ జీతం పొందే యన్. జి. ఓ లకు ఇవ్వనందుకు నిరసనగా

*Sri Gopidi Ganga Reddy* (*Mudhole*) *:* I beg to move :

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of Stare, Ministers and Headquarters staff by Rs. 100

గాంధీజీ అజ్ఞానుసారము వేతనములు పెంచనందులకు

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

మంత్రులు ఆకస్మికపర్యటన చేయనందులకు మరియు పాత సాంప్రదాయముచే నడిపించినందులకు

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

సర్కారు ఉద్యోగులను బర్తీచేయు విధానమును గూర్చి చర్చించుటకు

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

కార్యదర్శుల కార్యాలయములు నడుపు విధానములను మరియు ప్యూన్సు చేత తమ యింటి పనులను చేయించుటను గూర్చి చర్చించుటకు.

*Sri K. Muthiam Reddy (Nirmal) :* I beg to move :

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

ప్రభుత్వ ఉద్యోగులు లంచగొండితనము, సోమరితనముచే కార్యములు సరిగ నడుపనందులకు.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

పల్లెటూళ్లను దోచి పట్టణాలలో పెద్దపెద్ద భవనాలు మొదలగునవి నిర్మించుట, పెద్దపెద్ద ఉద్యోగుల కొరకై వృథాగా ఖర్చులు చేసినందులకు.

To reduce the allotment of Rs. 1,14,16.100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

పెద్ద ఉద్యోగుల వేతనములు తక్కువ చేసుకోనందులకు, గాంధీగారి సలహాలను పాటించనందులకు.

*Sri Baswa Maniah (Andole) :* I beg to move :

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

హైదరాబాదునుండి ఆంధ్ర చిన్న ఉద్యోగులను తెలంగాణా జిల్లాలలో నింపు ప్రభుత్వ విధానమును విమర్శించగలందులకు.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

కార్యదర్శి ఆఫీసులో ప్రభుత్వ నియమావళి తీసివేసినా మదరాసు రూల్సును తెచ్చి రుద్దే ప్రభుత్వ విధానమును విమర్శించగలందులకు.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

కొత్త ఉద్యోగ స్థలాలలో మూడింట రెండు తెలంగాణా వారిని తీసుకునే బదులు ఆంధ్ర జిల్లాలనుండి హైదరాబాదు ఆఫీసులకు నేరుగా ట్రాన్సుఫరుచేసి ఆంధ్రజిల్లాలలో కొత్త అపాయింటుమెంట్స్ సాగించు ప్రభుత్వ విధానమును విమర్శించగలందులకు.

*Sri S. Kasi Reddi (Podili)* : I beg to move :

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

జీవనప్రమాణ సూచక దృష్ట్యాను, జీవిత అత్యవసర వస్తువుల ధరలపెరుగుదల దృష్ట్యాను, నాన్ గెజిటెడ్ ఉద్యోగస్థుల జీతభత్యములను పెంచనందుకునూ వారి కరువుభత్యము కేంద్ర ఉద్యోగులలో సమానముగ జీతము కలుపనందుకు.

*Sri K. Raiamallu (Sirpur-General)* : I beg to move :

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Re. 1
To discuss the functioniug of the Heads of State.

*Sri Krishnamachari (Sangareddy-General)* : I beg to move :

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

పెద్ద ఉద్యోగస్థుల జీతాలను తగ్గించనందులకు.

To reduce the allotment of Rs, 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

ప్రజలు సమర్పించు వినతి పత్రములు, వారి కేసులు సంవత్సరముల తరబడి తీర్పుచేయక, ఆలస్యము చేయుచున్నందులకు.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

దేశములో లంచగొండితనమును అరికట్టుటలో విఫలమయిన మంత్రుల్ల విషయము చర్చించుటకు

14th March, 1958]

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

ఉద్యోగులు తమ ఇండ్లలోను తమ స్వంత పనులలోను ప్రభుత్వముచే నియమించు ప్యూనులచే పని చేయించుకొనుచున్నందులకు విమర్శించుటకుగాను

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headqnarters staff by Rs. 100

అధికారులు సక్రమముగా పనిచేయక పోవుటయు అందువలన ప్రజలకు కలుగు ఇబ్బందులను విచారించుటకు

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

మంత్రులు అధికార పర్యటనలను తమ పార్టీ ప్రయోజనాలకై వినియోగించుకొనుట గురించి చర్చించుటకు గాను

*Sri B. Sriramamurthy (Vizayanagaram)* : I beg to move :

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

To discuss the failure of the Government to increase the scales of pay of the Non-gazetted or low-grade employees.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

To discuss the failure of the Government to constitute a Pay Commission with a view to make recommendations for the increase of scales of pay of non-gazetted officials and low grade employees.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

To discuss the failure of the Goverment to appoint a high power administrative enquiry committee to go into the question of integration of services in Telangana and Andhra regions.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

To discuss the failure of the Government to fix the maximum limit of the highest scales of pay at Rs. 1000 per month and their failure to increase the scale of pay of the low-paid employees.

To reduce the allotment of Rs. 1.14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

To discuss the failure of the Government to adopt economy measures, simplify the procedures and to cut red-tapism and reduce the top-heaviness of the administration.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headpuarters staff bp Rs. 100

[14th March, 1958

To criticise the compulsory collection of small savings from persons belonging to low-income groups.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

To criticise the failure of the Government to re-organise the structure of administration to suit the needs of democracy and decentralization and to end red-tapism and bureaucracy.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

To criticise the failure of the Government to adopt Telugu as the official language of the State Government.

*Sri K. Jaganmohan Reddy(Pargi)* : I beg to move:

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

మంత్రులు ప్రజలయొక్క డబ్బును సరియైన పద్ధతిలో వినియోగించక అనవసరముగా కొల్లగొట్టుచున్నందువల్ల.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

హెడ్ క్వార్టర్సు స్టాఫ్‌ను అధికంగా పెట్టి ప్రజలయొక్క ద్రవ్యమును సరియైన విధానంలో ఖర్చుపెట్టనందుకు.

*Sri K. L. Narasimha Rao (Yellandu-General)* : I beg to move.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

మన రాష్ట్రంలో జరుగుచున్న బై-ఎలక్షన్ సందర్భంలో మంత్రులు అధికారయుతంగా పర్యటించడంగురించి, ప్రతిపక్షాలను అసహ్యాకరమైన దుర్భాషలాడడం గురించి, ఎన్నికలలో దౌర్జన్యమును రెచ్చగొట్టి, శాంతియుత వాతావరణంలో ఎన్నికలు జరుగవలసిన సత్సాంప్రదాయాన్ని అడుగడుగునా అడ్డగిస్తున్న విధానాన్ని గురించి.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

యన్. జి. ఓ. లలోను, ఇతర ఉద్యోగులలోను పెరిగిపోతున్న అసంతృప్తికి కారణాలను పరిశీలించి న్యాయమైన పద్ధతులద్వారా వాటిని సవరించి వారిలో సమర్థతను పెంచుటలో ప్రభుత్వ విఫలతను గురించి

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధిపరచడంలో తీసుకోనవలసిన ప్రత్యేక శ్రద్ధ మన మంత్రులలో లోపించడంగురించి.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

ప్రజా సమస్యలను పరిష్కరించడంలో శ్రద్ధ చూపుటకు బదులు మంత్రులు పర్యటన విషయంలోనే అనవసరమైన శ్రద్ధ చూపు విధానముగురించి.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

విచ్చలవిడిగా డిపార్టుమెంట్సులో హెచ్చుమీరుతున్న లంచగొండి విధానమును, బంధుప్రీతిని, ఆశ్రిత పక్షపాతమును తొలగించడంలో మంత్రుల విఫలతను గురించి.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

ప్రజా సమస్యల పరిష్కారం ఎడల స్వయంగా మంత్రులు అవలంబిస్తున్న పక్షపాతవైఖరి, ప్రాంతీయ తత్వమును గురించి.

To reduce the allotment of Rs. 1,14,16,100 for
Heads of State, Ministers and Headquarters staff by Rs. 100

ప్రజల ఆర్థిక స్థితి గమనించికూడా ప్రతినిత్యం సాధారణ ప్రజానీకంపై ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పన్నుల భారాన్ని మోపడం గురించి స్మాల్ సేవింగ్స్ రైతులనుండి నిర్బంధంగా వసూలుచేయడం గురించి.

DEMAND NO. XI–*State Legislature*–*Rs*. 38,72,700.

*Sri Vavilala Gopalakrishnayya* : I beg to move :
To reduce the allotment of Rs. 38,72,700 for
State Legislature by Rs. 100

యం. యల్. ఎ. హాస్టలులోనూ, ఎసెంబ్లీలోనూ అదనంగా ఇంకా రెండు టెలిఫోనుబూతులు యేర్పాటుచేయవలసినదిగా కోరుటకు.

*Sri A. Venkatrama Raju (Rajole-General)* : I beg to move
To reduce the allotment of Rs. 38,72,700 for
State Legislature by Rs. 100

ప్రతిపక్ష నాయకులకు ఒక కార్యదర్శిని, ఒక కారును ఏర్పాటుచేయవలసిన అవసరాన్ని గుర్తించనందులకు.

To reduce the allotment of Rs. 38,72,700 for
State Legislature by Rs. 100

[ 14th March, 1958

శాసనసభా శెక్రిటేరియేట్‌లోను, మొత్తం శెక్రిటేరియేట్‌నుండి విడదీయు విషయమును చర్చించుటకు.

To reduce the allotment of Rs. 38,72,700 for State Legislature by Rs. 100

తెలుగులో మొత్తం శాసనసభా వ్యవహారములను నడుపుటలో విలంబన జరుగుతూన్న విషయమును చర్చించుటకు.

To reduce the allotment of Rs. 38,72,700 for State Legislature by Rs. 100

బిల్లులు ప్యాసుకాబడి తరువాత రూల్సురావడంలో జరుగుతూన్న జాగును గురించి చర్చించుటకు.

*Sri K. Muthiam Reddy :* I beg to move :

To reduce the allotment of Rs. 38,72,700 for State Legislature by Rs. 100

శాసనసభ సభ్యులకు సరైన సౌకర్యములు, వసతులు ఏర్పరచలేనందులకు.

*Sri Dodda Narasiah (Suryapeta-General) :* I beg to move:

To reduce the allotment of Rs. 38,72,700 for State Legislature by Rs. 100

అసెంబ్లీలో ఇవ్వబడే ప్రధానమయిన రిపోర్టులు, బడ్జెట్టుపట్టికలు తెలుగులో ఇవ్వకపోవడంగురించి.

To reduce the allotment of Rs. 38,72,700 for State Legislature by Rs. 100

శాసన సభా సభ్యుల క్వార్టర్సులో సాధారణంగా కావలసిన సౌకర్యాలు కూడా కలిగించకుండుటను గురించి.

To reduce the allotment of Rs. 38,72,700 for State Legislature by Rs. 100

శాసనసభాసభ్యులకు వారి నియోజకవర్గములోనూ, అధికార, అనధికార సమావేశముల సందర్భంలో ప్రయాణంచేయుటకువీలుగా బస్సు, రైల్వేపాసులు ఇవ్వకపోవడంగురించి.

*Sri B. Sriramamurthy :* I beg to move :

To reduce the allotment of Rs. 38,72,700 for State Legislature by Rs. 100

To discuss the failure of the Government to either take suitable and prompt action or even send up replies to the Legislators on the matters brought by them to the notice of either the officials or the ministers.

*Sri Dodda Narasiah* : I beg to move :

To reduce the allotment of Rs. 38,72,700 for
State Legislature by Rs. 100

శాసనసభాసభ్యులు పంపుకునే ఉత్తరాలకు మంత్రులనుండిగాని, అడ్మినిస్ట్రేషన్ శాఖలనుండిగాని సమాధానములు ఇవ్వకపోవడంగురించి.

*MR. SPEAKER* : All these cut motions are now before the House.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి :- అధ్యక్షా, ఇది చాలా ముఖ్యమైన డిమాండు. దీనిపైన ముఖ్యమంత్రిగారు చేసిన ఉపన్యాసమును చాలా శ్రద్ధతో విన్నాను. కాని నాకు కొంత ఆశాభంగం కలిగింది. వారి ఉపన్యాసంలో ముప్పాతిక భాగం ఆంధ్ర తెలంగాణా సమస్యపైన పోయింది. అదేమీ ముఖ్యమైన సమస్య కాదని నేను మనవి చేయదలచుకోలేదు. కాని దానికంటె చాలా ముఖ్యమైన సమస్యలు యీ డిమాండులో వున్నాయి. ఈనాడు పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన ఆర్థిక సమస్య వున్నది. తత్సంబంధమైన విషయాలపైన ఏ మాత్రం శ్రద్ధ చూపక తెలంగాణా ఆంధ్ర సమస్యపైననే ముప్పాతిక భాగం, పదునాలుగణాల భాగం కూడా, తమ ఉపన్యాసమును పోనిచ్చినారు. ఇది చాలా దురదృష్టకరమని తమ ద్వారా వారికి మనవి చేయదలచుకున్నాను. ఇప్పటికే అభిప్రాయ భేదాలు చాలా తీవ్రరూపంగా పరిణమించినది. దీనిపై చర్చకూడా అదే స్వరూపంలో వెళ్లే ప్రమాదం వున్నది. ఈ తెలంగాణా ఆంధ్ర సమస్య ఎంత ముఖ్యమైనదైనప్పటికీ మన ఆర్థిక విధానంలో; పరిపాలనా విధానంలో దీనికంటె చాలా ముఖ్యమైన సమస్యలు మనలను ఎదిరిస్తున్నాయి. వాటిపైన ముఖ్యమంత్రిగారేమైనా సెల విస్తారేమోనని చాలసేపు చూచాను. కాని వారి ఉపన్యాసం చాలా ఆశాభంగం కలిగించింది. Heads of States గురించి మొదట మనవి చేస్తున్నాను. ఇది చాలా ముఖ్యమైన సమస్య. ఎందుకంటే పరిపాలనా యంత్రం అంతా యీ Heads of States వల్లనే జరుగుతుంది. దీనికి గ్రాంటు చేసిన మొత్తం అంత చిన్నదేమీకాదు. దాదాపు 1,14,000 రూపాయలు దీనికి మంజూరు చేయుమని ముఖ్యమంత్రిగారు కోరుతున్నారు. ఈనాడు పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన మన భారతదేశపు ఆర్థిక విధానం, మన రాష్ట్రపు ఆర్థిక విధానం ఒక రకమైన సంక్షోభానికి గురియైనవి. ఈనాడు పంచవర్ష ప్రణాళికను జయప్రదం చేసేందులకు మనం ఎంతో డబ్బు మిగిలించవలసి వున్నది. మనం డబ్బును ఎంతో పొదుపుగా వాడుకోవలసివున్నది. కాని నేను బడ్జెటుకు సంబంధించిన సంఖ్యలు చూడగా, Heads of the Departments వారు తమ సొంతంకొరకై తమ దర్జాల కొరకై చేస్తున్న ఖర్చును చూడగా కాంగ్రెసు మంత్రులు కాంగ్రెసు నాయకులు

చెప్పే పొదుపు ఉద్యమానికి ఏ మాత్రం అర్థం లేకుండా పోతున్నదని చాలా స్పష్టమవుతున్నది. అవి శ్రీరంగనీతుల క్రిందనే వుండిపోతున్నాయి గాని యదార్థముగా వారి జీవితాలలో తమ దర్జాలను, తమ పటాటోపములను ఏమాత్రం తగ్గించుకోడానికి సిద్ధంగాలేరని చాలా స్పష్టమవుతుంది. Small Savings Scheme క్రింద యీనాడు రైతులనుండి గోళ్లూడగొట్టి డబ్బు వసూలు చేస్తున్నారు. మంత్రులకైనా ప్రభుత్వాధికారులకైనా ఆ విధంగా వసూలుచేసే హక్కు శాసన రూపమైన హక్కు వుండవచ్చును. కాని నైతిక హక్కు ఏ మాత్రమూ లేదని తమద్వారా మంత్రివర్గానికి మనవి చేయదలచుకున్నాను. ఈనాడు Heads of State కి ఎంత ఖర్చవుతున్నది ? ఏమయినా పొదుపు చేసేందుకు Heads of State ప్రయత్నం చేస్తున్నారా ? ఇక్కడి సంఖ్యలు చూస్తే వారు దాంట్లో కించిత్తయినా ప్రయత్నం చేయలేదని స్పష్టమవుతున్నది. మొదట కొన్ని సంఖ్యలు వెతుకు కోవలసివచ్చింది అన్నీ ఒక చోటలేవు. వెతుకగా, వెతుకగా ఆ సంఖ్యలు దొరికినవి. గవర్నరుగారి గురించి ఇదివరకే మనవి చేశాను. గవర్నరు గారికి Constitution ప్రకారం హక్కువుందని పదేపదే చెబుతూవుంటారు. మేము పదే పదే వింటున్నాం. సరే మేముకూడా Constitution ను చూస్తే గవర్నరుగారికా హక్కు వుంది అని అంగీకరిస్తున్నాము. Constitution ను మేము గౌరవిస్తున్నాము. Constitution ను మేము అగౌరవపరచే సమస్యలేదు. కాని దానిలోని ప్రతి Article ను ప్రతి Schedule ను గౌరవించవలసిన పనిలేదు.. ఎందుకంటే దానిలో యిదివరకు చాలా మార్పులు వచ్చినాయి. అవసరం అయితే మార్చుకోవలసిన అవకాశం వుంటుంది. Constitution మొత్తంపైన దాని fundamentals ను గౌరవిస్తాం కాని దాంట్లో ఇక Schedule లు - గవర్నరుకు సంబంధించిన విషయాలు వ్రాసివున్నప్పుడు దానిని విమర్శించకూడదని నిషేధం ఎక్కడాలేదు. ఆ అధికారం మాకున్నదని స్పష్టంగా అభిప్రాయపడుతున్నాను. గవర్నరుగారి ఒక్కరికే యీ సంవత్సరం బడ్జెటులో 8,75,000 రూపాయలు కేటాయించబడింది. వారి పటాటోపాలకు, వారి భవనాలకు కూడా యిందులో చేర్చబడివున్నది. 4,75,000 రూపాయలు వారి జీతం మొదలైన వాటికి ఖర్చవుతుంది. దాని తరువాత 4 లక్షల రూపాయలు వారి క్రొత్త భవనాన్ని నిర్మించడానికి కేటాయించారు. వారి భవనంకొరకు మొత్తం 10,80,000 రూపాయల estimate వుంది. దానిలో యీ సంవత్సరం 4,00,000 రూపాయలు కేటాయించబడింది.

పొదుపు ఉద్యమము అని చెపుతున్న పరిపాలకులు ప్రభుత్వమునకు రైతులు చెల్లించే డబ్బును ఖర్చుచేయుటలో పొదుపు ఈ విధముగా వుంది. మా మంత్రి పుంగవులు 1000 రూ॥ లు జీతము తీసుకొంటున్నామని చెపుతున్నారు. బడ్జెటులో

provide చేసినది మాత్రము వారి జీతాల నిమిత్తం 1000 రూ॥ అని మాత్రమే వుంది. వారికి Constitutional guarantees ఏమీ లేవని అనుకొంటాను. వేరే విధంగా వారి కొరకు ఖర్చుపెట్టుకొనే మార్గాలు Budget లో వున్నాయి. లెక్కలు పరిశీలించి చూస్తే మొత్తము 14 మంది మంత్రులు అని అనుకొంటాను. మొన్నటి వరకు 13 మంది వుండేవారు. ఇప్పుడు 14 మంది అయినారు. 14 మంది మంత్రులకు అయ్యే ఖర్చు ఈ విధముగా వుంది. Pay of officers, pay of establishments, T. A., House rent, dearness allowance, Office contingencies యిత్యాదులు అన్నీ కలిస్తే 659 వేల రూ॥ లు మంత్రుల మీద ఖర్చు అవుతున్నది. Budget figures పరిశీలించి చూస్తే Civil Works పద్దులో కొంత ఖర్చు బయటపడింది. వారి భవనాల కొరకు, వాటిలో పంకాల కొరకు, ఇంకా యితరమైన వాటికి కొంత ఖర్చు చేస్తున్నారు. కొన్ని పద్దులు చేరిస్తే నేను సేకరించినంత వరకు 169 వేలు బయటపడింది. దాదాపు మంత్రుల పైననే 8 లక్షలు రూపాయలు ఖర్చు అవుతున్నవి. లెక్కలలో కొద్దిగా పొరపాటు వుండి వుండవచ్చును. వారియొక్క యితర demands పైన వుండే ఖర్చు లెక్కవేసి చూస్తే ఇది తేలింది. మొత్తము మీద ప్రతి మంత్రివర్యుడు 5 వేల రూపాయలు ఖర్చు చేస్తున్నాడు. ఒక వైపున నెలకు 1000 రూ॥ లు జీతము తీసుకొంటున్నామని చెపుతున్నా రెండో వైపున దాదాపు నెలకు 5000 రూ. లకు పైగా ఖర్చు వుండవచ్చు. వారు చెప్పే మాటలకు ఏమీ అర్థముండదని స్పష్టమవుతున్నది. ఇంకా క్రిందికి దిగితే Secretary లు ముఖ్యమైన సెక్రెటరీల జీతాలు పరిశీలించి చూస్తే Chief Secretaryకి 3500 రూ॥లు జీతము ఇస్తున్నారు. వారికి కూడా Constitutional guarantees లేవని అనుకొంటాను. Chief Secretary గారికి ఇంత జీతము ఎందుకు ఇస్తున్నారో నాకు అర్థమగుట లేదు. అదే విధముగా Finance Secretary గారికి 2250 రూ.ల జీతము. కొందరు సెక్రటరీలకు grades వున్నాయి. కొందరికి grades లేవు. రెవెన్యూ సెక్రటరీకి 1000 నుంచి 2500 వరకు grade వుంది. Law Department Secretary గారికి 3000 రూ॥లు జీతము, P. W. D. సెక్రటరీగారికి రు. 1000 నుంచి రు. 2500 వరకు grade వుంది. Health Department లో ఒక ప్రత్యేకమైన Secretary గారు వున్నారు. వారికి కూడా grade లేదు. Special pay 250 రూ. లతో పాటు 2250 రూ. ల వరకు జీతమిస్తారు. Education department సెక్రటరీకి రు. 1000 నుంచి 2500 రూ. లు వరకు ఒక grade వుంది. Industries Secretary కి 1000 నుంచి 2500 రూ.ల వరకువుంది. వారు ఎంతెంత జీతాలు తీసుకొంటున్నారో నాకు తెలియదు. Grades మాత్రమే Budget లో తెలిపారు. జడ్జీల జీతాలలో ప్రధాన జడ్జి జీతము 4000 రూ॥ లు. 12 మంది జడ్జీలు వున్నారు. అని వ్రాసివుంది. ఈ మధ్య ఇద్దరు ఎక్కువ అయి

[14th March, 1958

నారు. మొత్తము 14 మంది Judges అయినారు. వారికందరికి రూ. 3500 లు జీతమిస్తున్నారు.

శ్రీమతి కె. లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం-జనరల్):- గవర్నరుగారి జీతాన్ని గురించి అసెంబ్లీలో చర్చ చేయవచ్చునా ?

శ్రీ ఆర్. నారాయణరెడ్డి:- దాని కవసరమైన విషయము మొదటనే మనవి చేశాను. Constitutional authority వారికి వుంది. Constitution లోని ఆర్టికిల్ మీద పార్లమెంటులో నేను నాలుగు అయిదింటిమీద వోటు ఇచ్చి వచ్చాను. ఇది ఏమీ sacrosanct అనుకొనడములేదు.

మిస్టరు స్పీకరు :-లేదు. కాని ఒకటివుంది నేను అదే చూస్తున్నాను. "The following expenditure shall be expenditure charged on consolidated fund of each State" అని ఉన్నది. దానిమీద వోటు చేయ డానికి అధికారము లేదు.

*Sri N. Sanjeeva Reddi :* They can discuss but cannot vote. That is the convention.

శ్రీ ఎస్. కె. వి. కృష్ణావతారం :– ముఖ్య మంత్రిగారి అభిప్రాయముతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. మీతోమాట్లాడవలెనంటే భయము వేస్తున్నది

మిస్టరు స్పీకరు:–అట్లా వుండడము మంచిదే. మీరు అందరు discipline maintain చేస్తున్నందుకు మిమ్ములనందరిని అభినందిస్తున్నాను,

శ్రీ ఆర్. నారాయణరెడ్డి:– అందుచే ఈ సంఖ్యలన్నీ మంత్రివర్యుల ముందు వుంచి ఒక appeal చేయదలచుకొన్నాను. మన పంచవర్ష ప్రణాళిక ఆర్థిక సంక్షోభములో పడిపోయింది. దానిని సవరించుకొనడానికి ఈ పొదుపు ఉద్యమాన్ని జాగ్రత్తగా జయప్రదము చేసుకోవాలి. పొదుపు మంత్రివర్యులతోనే ఆరంభం కావాలని మనవి చేస్తున్నాను. మంత్రివర్యులు పొదుపుచేయకుండా వారి దర్జాలకు ఖర్చు పెట్టుకుంటున్నారు. వారి తోటమాలి, వారి జమేదారులు, Private Secretary లు వీరందరి విషయంలో పొదుపు చేయకుండా ప్రజలకు appeal చేస్తే ఏ మాత్రము అర్థముండదు. ఎన్నో విషయాలలో మనము పొదుపు చేయవలసి వున్నది. మంత్రివర్యులే స్వయముగా ఆదర్శముగా ప్రవర్తించాలి. ఆదర్శముగా వుండి యితరులకు చెబితే అర్థముంటుంది. పల్లెటూళ్లలో శిస్తులు చెల్లించేటప్పుడు 4 రూపాయలు కట్టే రైతునుంచి 2 రూపాయలు పొదుపు కొరకు వసూలు చేస్తూండడములో అర్థము లేదు. వారు ఏ మాత్రము యీ విధముగా inspire చేయలేరు. పంచవర్ష ప్రణాళికను జయప్రదము చేయలేరు. నైజాము కాలములో నైజాము అనుభ

వించినదర్జాలు ప్రజాస్వామిక రాజ్యములో యీగవర్నరుకు ఎందుకు ? గవర్నరు గారు ఎంతో దర్జాలతో వుంటున్నారు. వారు వస్తున్నపుడు traffic ఆపబడుతుంది. నైజాము వచ్చేటప్పుడు traffic 3 నిమిషాలు ఆపుచేసేవారు. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 10 సంవత్సరాలు అయింది. ఇప్పుడు గవర్నరు వస్తుంటే traffic ఆపుటవలన ప్రజలకు ఎంతో అసౌకర్యము కలుగుచున్నది. ఇట్టి అలవాట్లు మానుకోవాలి అని అందరికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఉద్యోగులు మొదలు మంత్రి వర్యులవరకు జీతాలు తగ్గించుకోవాలి. ఉన్నతోద్యోగులు, మంత్రివర్యులు ముందు దీనిని ఆచరణలో పెట్టాలి. వారిలో వున్న బలహీనతలు వీరికి తెలుసు. ఈ నాడు నైతికముగా చెప్పేశక్తి వారికి లేదు. ఉన్నతోద్యోగుల జీతాలు తగ్గించడమే కాకుండా ప్రయాణ ఖర్చులు కూడా తగ్గించుకోవాలి. మంత్రుల ప్రయాణ ఖర్చులు చూస్తే 1 లక్ష 50 వేలుకంటె ఎక్కువగా వుంది. ఇంత ఎందుకో నాకు అర్థము కావడములేదు. ప్రభుత్వం motor cars ఉపయోగము తగ్గించుకోవలసి వుంటుంది. Postage, telephone విపరీతముగా ఉపయోగిస్తారు. వాటినన్నింటిని తగ్గించుకొనవలెను. ప్రభుత్వముచేసే విందులు తగ్గించాలి. ఎక్కడ దుర్వినియోగ మవుతున్నదో వారుచూసి అట్లా కాకుండా చూడాలి. మంత్రులు ముందుకు వచ్చి ఇవన్ని చేయాలని గత సంవత్సరం విజ్ఞప్తిచేశాను. ఇపుడు కూడా తిరిగి విజ్ఞప్తి చేస్తున్నాను. మంత్రులు ఇది ప్రజాస్వామిక పరిపాలన అని చెప్పుకుంటారు. పరి పాలనలో చాలా Bureaucracy వుంది. ప్రజాస్వామికము నూటికి నూరు పాళ్ళు వుందని ప్రచారము చేస్తుంటారు. రాజ్యాంగ బద్ధముగాకాని, ప్రజాస్వామిక సూత్రాల ప్రకారము గాని ప్రజాస్వామికము చాల పరిమితమై వుంది. పూర్తిగా Centralised administration వుంది. పార్లమెంటుకు కొందరు ప్రతినిధులు ఎన్నుకోబడినంత మాత్రాన అసెంబ్లీ సభ్యులు ప్రజలచేత direct గా ఎన్నుకో బడినంత మాత్రాన పరిపాలనా యంత్రము అంతా ప్రజాస్వామికమే అనుకోవ డం యథార్థమైనది కాదని చెప్పుచున్నాను. ఉద్యోగుల యొక్క స్వభావము ఏమిటి ? కేంద్రీకృతమైన పరిపాలనా విధానములో వారు ఉద్యోగులను అదుపులో వుంచగలుగుతారా? పరిపాలనా విధానమును ఒక ప్రజాస్వామిక పద్ధతిలో వుంచగలుగుతారా? వారికి ఇష్టము వున్నప్పటికిని సాధ్యముకాదు. మన ఉద్యోగుల స్వభావము ఏమిటి ? పండిట్ జవహర్ లాల్ నెహూ్రు ఉద్యోగుల గురించి Discovery of India లో చాల కాలము క్రితమే వ్రాసినారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కాలములోను, నైజాము feudal విధానములోను ఈ ఉద్యో గులు అంతా training పొందినవారే వీరు అంత సులభముగా లొంగుతారని అను కొనడము జరిగితే మంత్రులు చాల అమాయకులని భావించవలసి వుంటుంది.

పండిట్ జవహర్‌లాల్ చాల చక్కని విషయాలు వ్రాశారు. పత్రికలనుంచి తీసిన యీ పెద్ద statement చదువుతాను వినవలెనని కోరుతున్నాను.

"Civil Services had a reputation, chiefly self-propagated, for efficiency. But it became evident that out of the narrow sphere of work to which they had been accustomed, they were helpless and incompetent; they had no training to function democratically and could not gain the good-will and co-operation of the people whom they both feared and despised; they had no conception of big and vast schemes of social progress and could only hamper them by their red-tape and lack of imagination. Apart from certain individuals, this applies to both British and Indian Members of the Civil Services. It was extraordinary how unfit they are for the new tasks that face them".

యదార్థముగా ఇది మన Civil Services కు apply అవుతుందనడములో నా కేమాత్రము సందేహములేదు. ఈ విషయములో నాతో చాల మంది ఏకీభవిస్తారని తలుస్తాను. అయితే దానిని ఎట్లా సంస్కరించాలి. Administrative reforms తీసుకొని వచ్చేటందుకు ముఖ్యమంత్రిగారు గాని, ఆర్థిక మంత్రిగారు గాని తమతమ ఉపన్యాసములలో ఏమీ పేర్కొనలేదు. Administrative reforms చాల అవసరము. ఏ ఆశయసిద్ధికోసం మనము పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుతున్నామో ఆ ఆశయ సాధనకు అనువైన యంత్రాంగాన్ని మనము సమకూర్చుకోవాలి. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు feudal పరిపాలకులు తమ దోపిడీ విధానాన్ని కొనసాగించేందుకు చేసిన పరిపాలనా విధానమిది. దానితోనే మన పరిపాలకులు పంచవర్ష ప్రణాళికను అమలు జరిపేందుకై చూస్తున్నారు. దీనిలో విఫలులు అవుతారని మంత్రివర్గానికి మనవి చేస్తున్నాను. ఇది సాధ్యమైన పని కాదు. ప్రజలయొక్క సహాయము వుంటేతప్ప ఈపంచవర్ష ప్రణాళికలు అమలు జరపబడవు అని నా అభిప్రాయము. గ్రామ level లోను, తాలూకా level లోను, district level లోను ఈ కేంద్రీకరణ తీసివేసి వికేంద్రీకరణ చేసినట్లయితే ప్రజలకు కొద్దిగా ఉపయోగపడుతుంది. ప్రజలు ఉద్యోగుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడవలసి వస్తున్నది. ఎవరికైనా M. L. A. లతో సంబంధము వుంటే వారిద్వారా మంత్రిగారితో పరిచయము సంపాదించుకొనవచ్చు. ఈ Administrative reforms ను గురించి ఆలోచించాలని మనవి చేస్తున్నాను. సుందరయ్యగారు చెప్పినట్లు ఈ M. L A. లతోను అధికారులతోను కూడిన ఒక కమిటీని వెయ్యాలి. నేను దానిని బలపరుస్తున్నాను. పరిపాలనా యంత్రము ప్రజాస్వామికముగా పనిచేసేందుకు- పంచవర్ష ప్రణాళికలు సక్రమముగా అమలు జరిగేందుకు

వారు ప్రజలయెడల సరిగా ప్రవర్తించేందుకు ఈ Commission వారిచేత పరిశీలన చేయించి సంస్కరణలను తీసుకొని రావలెనని మనవి చేస్తున్నాను.

గోపాలరెడ్డిగారు టాటనహామ్ సిస్టమ్ గురించి చెప్పారు. ఆంధ్ర ఉద్యోగులు చాల superiority complex తో ప్రవర్తిస్తున్నారని చెపుతూ వారు కూడ ఒక విధమైన superiority complex తోనే సమాధాన మిచ్చారు. ఎందుకు ఈ టాటనహామ్ రూల్సు అమలు జరుపవలసి వచ్చినదో నాకు అర్థము కావడం లేదు. ఈ rules ఒక శతాబ్దము క్రితము చేయబడినవి. హైదారాబాదు rules కూడ ఒక శతాబ్దము క్రితము చేసి వుండవచ్చును. బ్రిటిష్ సామ్రాజ్య వాదులు నిర్మించిన ఈ రాజ్యాంగ యంత్రాంగానికి, నైజాము feudal విధానములోని rules కు వుండే భేదము Tweedle Dis, Tweedle Dum వలెనే ఉంది. ఎక్కువ భేద మగుపడుటలేదు. ఒక శతాబ్దము క్రితము చేసిన యీ rules ను తెలంగాణా ప్రజల అధికారులకు నేర్పండి అనడము ప్రజాస్వామికానికి వ్యతిరేకమని మనవిచేస్తున్నాను. దానిలో కొంచెం మంచి విషయాలు వుండవచ్చు. Feudal విధానములో కొన్ని మంచి విషయాలు వుండవచ్చు. ఒక కమిషనను ఏర్పాటుచేసి వాటిల్లో వున్న మంచి విషయాలను తీసుకొని ప్రజాస్వామికముగా rules ను రూపొందించవలసిన అవసర మున్నది. లేకపోతే దీనివల్ల ఆంధ్ర తెలంగాణావారికి అభిప్రాయ భేదాలు ఏర్పడును అని గుర్తించవలసివుంటుంది. సామ్రాజ్యవాదుల కాలములో వచ్చిన ఈ rules ను అమలు జరపాలనే ఆలోచనను మంత్రివర్గము వదిలిపెట్టి, మన పంచవర్ష ప్రణాళిక అమలు జరిగేందుకు; ఆర్థికస్థితిలో వారు పెంపొందేందుకు అనుగుణ్యామైన రూల్సును చేస్తే బాగుంటుంది. ఇది కూడా administrative reforms లో ఒక భాగముగా వుండాలని మనవిచేస్తున్నాను.

భూసంస్కరణలగురించి మాకు ఆశ్చర్యమువేస్తుంది. దానిని గురించి కాంగ్రెసు పార్టీలో వచ్చిన గందరగోళాన్ని చూస్తే తెలుస్తుంది. ఒకరు మాట్లాడినది ఇంకొకరు అర్థముచేసుకొనే స్థితిలో లేరు. కాంగ్రెసు పార్టీకి క్రమ శిక్షణ వుందా లేదా అని సంశయింపవలసిన సమయము ఆసన్నమైందని తోస్తున్నది.

**శ్రీ ఎన్. సంజీవరెడ్డి:**—అధ్యక్షా ! నిన్న రెవిన్యూ డిమాండులో భూసంస్కరణలను గురించి వివరంగానే చర్చించా రనుకొంటాను.

**శ్రీ ఆర్. నారాయణరెడ్డి:**— "Heads of States" Demand పైన అన్ని విషయాలనూ మాట్లాడవచ్చు.

**శ్రీ ఎన్. సంజీవరెడ్డి:**— మాట్లాడ కూడదనికాదు. చెప్పినదే మళ్లా చెప్పడం ఎందుకు అని. అంతకంటే ఏమీలేదు.

[14th March, 1958

శ్రీ ఆర్. నారాయణరెడ్డి:—నేను క్లుప్తముగానే ముగిస్తాను. భూసంస్కరణలను గురించి లోతుగా మాట్లాడదలచుకోలేదు. General debate లోనూ, నిన్న జరిగిన చర్చలోనూ వచ్చిన విషయాలనుబట్టి నాకు కొన్ని impressions కలిగినాయి. ప్రాగ్జ్యోతిష్‌పూర్‌లో భూసంస్కరణల గురించి కాంగ్రెసు కొన్ని తీర్మానాలు చేసింది. అంతేకాక, దీనికి సంబంధించి 10 సంవత్సరాల చరిత్ర ఉన్నది. ఇక్కడ మన మంత్రి వర్గంవారు కూడా ఒక Policy ని ప్రకటించారు. కాని, సభ్యులు మాట్లాడేటప్పుడు ఆ discipline పాటించడం లేదు. మంత్రులు యీ సభలో మాట్లాడినా, బయట మాట్లాడినా—మంత్రివర్గంలో వారికి joint responsibility ఉన్నదనే విషయాన్ని మరచిపోయి ఇష్టంవచ్చినట్లుగా మాట్లాడుతున్నారు. "మాది కాంగ్రెసు పార్టీ, దీనితో మీకు ఏమి సంబంధంచిన?" అని నన్ను ప్రశ్నించవచ్చు. కాని, దేశప్రజలందరికి సంబంధించిన ఒకప్రధానమైన సమస్యవచ్చినప్పుడు అన్ని విషయాలనూ దృష్టిలో పెట్టుకోవలసి యుంటుంది. "ఇది మా Democracy అని ముఖ్య మంత్రిగారు అంటారేమో ! అయితే, ఇది Ultra Democracy" అని నేను మనవి చేస్తున్నాను. Ultra-democracy అంటే— Anarchy. Anarchy అంటే Negation of Democracy. అంతే కాని, ఇది ఎంత మాత్రమూ Democracy కాదని ముఖ్య మంత్రి గారికి మనవి చేస్తున్నాను. భూసంస్కరణల విషయంలో "మిగతా ధనవంతుల నెవ్వరిని ప్రభుత్వంవారు ముట్టుకోవడంలేదు; ఒక్క భూస్వాముల వెంటనే పడ్డారు" అని కొంత మంది సభ్యులు మాట్లాడుతున్నారు. అది నిజమే. అందరినీ కూడా level up, level down చేయవలసినదే.

ఎక్కడెక్కడయితే దోపిడీ విధానం విపరీతంగా ఉన్నదో దానినంతా రూపుమాపాలి. భూసంస్కరణలు ఎక్కువ ప్రాముఖ్యం వహించుటకు కొన్ని కారణా లున్నవని సభ్యులకు మనవిచేస్తున్నాను. భారతదేశం వ్యవసాయక దేశం. దాదాపు నూటికి 80, 90మందివఱకు వ్యవసాయంపైన ఆధారపడినవారున్నారు. వ్యవసాయ రంగంలో సంస్కరణలు చేయనిదే, భూస్వామ్య విధానం రద్దుకానిదే మన ఆర్థిక స్థితి పెరగదు. ఉన్న సంకెళ్ళు తెంచుకోలేము. ఏ సమస్య తీసుకొన్నా, అది రైతాంగం యొక్క సమస్యగా పరిణమిస్తున్నది. రైతాంగంలో నూటికి 85 మంది బీదలు, వ్యవసాయ కూలీలున్నారు. వారి అభివృద్ధికి ప్రయత్నం చేయనిదే రైతాంగం యొక్క సమస్య పరిష్కారంకాదు. ఉత్పత్తే కాకుండా, ప్రజల కొనుగోలు శక్తి (Purchasing Power) కూడా పెరగనిదే లాభం లేదు. దేశం యొక్క సర్వతోముఖాభివృద్ధి ఆలోచించినప్పుడు, భూసంస్కరణలు ప్రధాన సమస్యగా గుర్తించి, ఆ పార్టీ విధానాలను అనుసరించాలని కోరుతున్నాను.

14th March, 1958]

ఎన్నికలనుగురించి ముఖ్యమంత్రిగారు మాట్లాడుతూ, సక్రమంగా జరిగాయని అధికార్లకు సర్టిఫికేట్లు యిచ్చారు. సక్రమంగా జరిగాయనే దానితో నేను ఏకీభవించను. అధికారులకు సంబంధించి నాకు అభ్యంతరం లేదుగాని, మంత్రులు ఎన్నికల్లో పర్యటచేసిన సందర్భాలలో నాకు చాలా ఆక్షేపణ ఉన్నదని మనవి చేస్తున్నాను. అధికారులలో ఏమైనా లోపాలు ఉంటే, అవి మంత్రులవల్లనే పైనుంచి క్రిందకు దిగుతున్నాయని స్పష్టముగా మనవి చేస్తున్నాను. మొన్న జరిగిన బుగ్గారం ఎన్నికలప్పుడు, గూండాయిజమ్ ఎక్కువైంది. ఒక శాసన సభ్యుని తల పగులగొట్టారు. ఇప్పుడు వాటికి ప్రాముఖ్యత యివ్వదలచుకోలేదు. ఇద్దరు శాసన సభ్యులు దెబ్బలు తిన్నారు. బుగ్గారం ఎన్నికలలో ఈ మంత్రులు వెళ్లి చేసినదేమిటి ? ఏ మాత్రం డెకోరం (decorum) వారు మిగల్చ దలచుకోలేదు. ఏదో ఆపదవచ్చినట్లు పరుగెత్తారు. 14 గురు మంత్రులలో బహుశః నలుగురు పోలేదేమో. మిగిలిన పదిమంది వెళ్లారు. దానికి ఆక్షేపణలేదు. మంత్రులు ఎలెక్షన్ ప్రచారమునకు వెళ్లవచ్చునా, లేదా అనేది లీగల్ విషయం. కోర్టులు కొన్ని decisions యిస్తున్నాయి. రాను రాను evolution లో ఏవిధంగా పరిణమిస్తుందో, ఆ విషయం యిప్పుడు మాట్లాడ దలచుకోలేదు. కాని అక్కడకు మంత్రులు వెళ్లి ఏమిచేశారు ? ఈ ఎన్నికలలో జె. వి. నరసింగరావుగారు చాలా శ్రద్ధ చూపించారు. ఒక్క పోలింగ్ ఏజంట్‌గా పని చేయలేదేమోగాని, మిగతా చేయవలసిన పనులన్నీ చేశారు. సామాన్యంగా మంత్రులు వెళ్లి ప్రచారం చేస్తే ఆక్షేపణలేదు. ఇదివరకు చేసిన పని, ప్రజలకు యికముందు చేయబోయే సేవ, చెప్పుకుంటే ఆక్షేపణలేదు. యదార్థంగా చూస్తే మంత్రుల హోదాలో ఉన్నవారు ఎన్నికలకు వెళ్లుట మంచిదికాదు. Legal position అలా ఉన్నది కాబట్టి దానిని గురించి ఆక్షేపించ దలచుకోలేదు. గూండాయిజమ్ గురించికూడా లోతుగా యిప్పుడు వెళ్లదలచుకోలేదు. ఎన్నికలలో మంత్రులు వెళ్లి అక్కడ వాళ్ల అధికారాన్ని దుర్వినియోగం చేశారు. వారు అక్కడికి మంత్రులుగా వెళ్లలేదు, కాంగ్రెసు కార్యకర్తలుగా వెళ్లారు. నేను ఈ సందర్భంలో ఒకటి రెండు విషయాలు మనవి చేస్తాను. జె. వి. నరసింగరావుగారు అక్కడకు వెళ్లారు. కోరట్లలో ఒక చెరువు ఉన్నది. అక్కడ ముస్లిములు ఉన్నారు. వారి కాగితపు పరిశ్రమ పోయిందట. రు. 1,40,000 లు యిస్తామని వాగ్దానం చేశారు. ఇది పొరపాటు. అదృష్టవశాత్తో, దురదృష్టవశాత్తో మా Candidate గెలిచాడు గాని, లేకపోతే వెంటనే వీరందరినీ కోర్టుకు లాగేవారము. గెలిచిన Candidate యిటువంటి వాటికి కేసుపెట్టే అవకాశంలేదు. అక్కడ గ్రామస్థులకు రు. 1,40,000 వేలు యిస్తావని వాగ్దానంచేశారు. నిరూపించటానికి సిద్ధంగా ఉన్నాము. ఒక కమీషన్‌ను వేయండి. నాపైన ప్రివిలేజిమోషన్ తెస్తే సాక్ష్యాలు చెప్పటానికి సిద్ధంగా

[14th March, 1958

ఉన్నాము. అక్కడ ఒక చెరువు ఉన్నది. అది చాలా పాతచెరువు. దానిక్రింద కొద్దిగా మాత్రం భూమి సాగవుతున్నది. దానికి వాళ్లు చాలా రోజులనుంచి డిమాండుచేస్తున్నారు. మంత్రిగారు ఎన్నికలముందు ఎప్పుడూ రాలేదు. ఎన్నికల సందర్భంలో సర్వే పార్టీని పిలిపిస్తారు. సర్వే చేయిస్తారు. అది మంజూరు చేశామని, కాంగ్రెసులో పని చేసే కార్యకర్తకు గుత్తకు యిచ్చామని, వోట్లు యివ్వమని అడుగుతారు. బహుశా వోట్లు సంపాదించడానికి యిటువంటి పద్ధతులను మంత్రులు అవలంబిస్తే, యిది పూర్తిగా కరప్ట్ ప్రాక్టిస్ క్రిందకు వస్తుంది. అక్కడ మంత్రులు యిచ్చే ఉపన్యాసాలకు హద్దూ పద్దూ లేదు. సంజీవయ్యగారు ఉపన్యసిస్తూ తమకు అధికారం ఉందని, కమ్యూనిస్టులను కాల్చి చంపివేయగలమని, ఎల్లారెడ్డిగారిని యిప్పుడే జైలులో పెట్టగలమని చెప్పితే—యివి ఏమి ఉపన్యాసాలో మాకు అర్థము కావడంలేదు. గోపులాపురంలో ఒక పట్వారీని మొఅత్తల్ చేశారు. ఇది ముఖ్యంగా జె. వి. నరసింగరావుగారు తాసిల్దారును పిలిపించి చెప్పి చేయించారు. డిప్యూటీ కలెక్టరుకూడా చెప్పలేదు.

సభ్యులు కావలిస్తే తరువాత వారికి టైము యిచ్చినప్పుడు చెప్పండి. జె. వి. నరసింగరావుగారి వద్దకు రైతులు వచ్చి యీ పట్వారీని మొఅత్తల్ చేస్తే వోట్లు యిస్తామని చెప్పారు. జె. వి. నరసింగరావుగారు డిప్యూటీ కలెక్టరుకు చెబితే తను రిటర్నింగ్ ఆఫీసరు కాబట్టి ఎట్లా జోక్యము కలిగించుకోవాలని చెప్పారు. అప్పుడు తాసిల్దారును పిలిపించి మొఅత్తల్ చేయించారు. ఇటువంటి పనులు మంత్రులు చేయకూడదని నా అభిప్రాయము. లేకపోతే ఎన్నికలు వట్టి ఫార్సు అవుతాయి. ఈనాడు మేముకూడ శాంతియుత పరిణామంలో సోషలిజము కావలెనని కోరుతున్నట్లు ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారికి కూడ తెలుసుననుకుంటాను. ఎన్నికలమీదనే ఆధారపడి బాలట్ బాక్సుద్వారానే, ఆ పెట్టెలో నుంచే మేముకూడ మంత్రులుగా పుట్టుకు రావాలని చూస్తున్నాము. ఇటువంటి పరిస్థితులలో వారు (ప్రభుత్వ పక్షమువారు) యిటువంటి అన్యాయాలు చేస్తే శాంతియుత పరిణామానికి అర్థము ఉండదు. ఇది డెమాక్రటిక్ పరిపాలన అనేదానికి అర్థము ఉండదు. ఇంకొక విషయం—సోవియట్ యూనియన్‌ను విపరీతంగా బూతులు తిట్టడం, విపరీతంగా విమర్శించడం చేస్తున్నారు. ఈ ఉపన్యాసాలు వింటూంటే పండిట్ నెహ్రూగారి విదేశాంగ విధానంతో ఏకీభవిస్తున్నారో, వ్యతిరేకిస్తున్నారో, అనుమానంగా ఉంటున్నది. తిమ్మారెడ్డిగారు ఇక్కడ చైనాను గురించి మాట్లాడారు. వారు తమ యిష్టంవచ్చినట్లు మాట్లాడారు. వారి మాటలకు హద్దూ పద్దూ ఉన్నట్లు కనుపించదు. మంత్రుల నిజమైన స్వరూపం ఎన్నికలలోనే అగుపడుతుందని తిమ్మారెడ్డిగారికి మనవి చేస్తున్నాను. నేను ముఖ్యమంత్రిగారికి మనవి చేసేది ఏమిటంటే, ఎన్నికలు ప్రజాస్వామికంగా నడిపించటానికి ప్రయత్నం

చేయండి. సంపూర్ణంగా ప్రజాస్వామికంగా ఎన్నికలు నడిపించటానికి మేము కూడ ప్రముఖ్యంతో సహకరించటానికి సిద్ధంగా ఉన్నాము. ఈ విషయాన్ని మంత్రి గారు దృష్టిలో ఉంచుకొంటారని ఆశిస్తూ, నాకీసమయ మిచ్చినందుకు అధ్యక్షుల వారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తూ, విరమిస్తున్నాను.

శ్రీ ఎ. సత్యనారాయణమూర్తి (పాలకొల్లు): అధ్యక్షా ! ముఖ్యమంత్రి గారు ప్రవేశపెట్టిన డిమాండ్లను నేను సమర్థిస్తున్నాను. అయితే డిపార్టుమెంటు లలో కొన్ని కొన్ని లోపాలు ఉన్నవి. ఆ లోపాలను వెల్లడిచేయటం నా విద్యుక్త ధర్మమని మీ ద్వారా మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

[Smt. T. Lakshmikantamma in the Chair]

గోదావరి నదిమీద ఆనకట్ట కట్టమని మేము చాలాకాలంగా కోరుతు న్నాము. ఆనకట్ట కడతామని ముఖ్యమంత్రిగారుకూడా చెబుతూవచ్చారు. డిపార్టు మెంట్‌వారు మాత్రం "దానికి ప్లాన్స్ తయారు అవుతున్నాయి" అని ఎప్పటి కప్పుడు చెప్పటం జరుగుతోందేగాని, ఇంతవరకు వాటిని పూర్తిచేయటంలేదు. ఒక ప్పుడు ఇప్పూరులో కడతామన్నారు. మరొకప్పుడు ఇచ్చంపల్లివద్ద కడతా మన్నారు. ఇప్పుడు పోచంపల్లిలో కడతామంటున్నారు. పోచంపల్లిలో కట్టినట్ల యితే హైడ్రో ఎలక్ట్రిక్ స్కీముగా అది ఉపయోగపడుతుంది తప్ప ఎగ్రికల్చరల్ పర్పసెస్‌కు విస్తారంగా తోడ్పడదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి : అధ్యక్షా ! వారు ఇరిగేషన్ డిమాండ్ వచ్చినపుడు ఆ విషయాలు చర్చిస్తే బాగుంటుంది. ఇప్పుడు దానికి నేను సమాధానం చెప్ప గలను; కాని అవకాశం లేదు. పోచంపాడు స్కీము పవర్ స్కీము కాదు. పోచంపాడు స్కీము పూర్తిగా ఇరిగేషన్ స్కీము. దానివల్ల తెలంగాణాలో 20 లక్షల ఎరాలు సాగు అవుతాయి. ఇచ్చంపల్లి స్కీము పవరు స్కీము. అయినా, సభ్యులు ఇరిగేషన్ డిమాండ్ వచ్చినపుడు మాట్లాడితే బాగుంటుందను కొంటాను.

శ్రీ ఎ. సత్యనారాయణమూర్తి : డిపార్టుమెంట్సు త్వరగా పనులు పూర్తి చేయటంలేదనే ఉద్దేశ్యం, ఇవితో చెప్పాను. పబ్లిక్‌వర్క్సు డిపార్టుమెంటు మా జిల్లాలో ఉన్నటువంటి మురుగు కాల్వలలో ఉండే నాచు, గుఱ్ఱపు డెక్క ప్రతి సంవత్సరం తీసేస్తూ, బాగుచేస్తూండేవారు. ఇప్పుడు ప్రతి సంవత్సరం కాకుండా, 3 సంవత్సరాల కొకసారి నాచు వగైరా తీయాలని పెట్టడంచేత, మా పంటలకు నష్టం కలుగుతున్నది. ఆ విధంగా కాకుండా, ప్రతి సంవత్సరం తీసేటట్లుగా, ఆ డిపార్టుమెంటుకు తాఖీదు పంపాలని మీ ద్వారా మంత్రిగారిని కోరుతున్నాను. మా జిల్లాలోని ఎర్ర కాలువవల్ల భీమవరం, తణుకు, తాడేపల్లిగూడెం తాలూకా

లలో నష్టం వస్తోంది. ఎర్ర కాల్వకు ఆనకట్ట కడితే, కొంత ప్రదేశం కొత్తగా సాగులోకి వచ్చే అవకాశం కలుగుతుంది. ఇప్పుడు జరుగుతున్న మురుగు నష్టం పోతుంది. ఎనమదుర్రు డ్రెయిన్ బాగుచేయించటానికి ప్రతి సంవత్సరం కొన్ని లక్షలు ఖర్చుపెడుతున్నారు. ఈ ఆనకట్ట కడితే, యీ డబ్బు ఖర్చుపెట్టకుండా పోతుంది. కాబట్టి ఆ డిపార్టుమెంటువారు త్వరగా పరిశీలనచేసి, తొందరగా ఎర్ర కాలవకు డామ్ కడతారని ఆశిస్తున్నాను. ముఖ్యంగా నేను ఆహారధాన్యాల యొక్క ధరల విషయం మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. మన ఆంధ్ర దేశంలో పంటను హెచ్చుగా పండించి, మనకు అయ్యే ఖర్చుపోను, ఇతరప్రాంతాలకుకూడా పంపిస్తున్నాము. కాని కేంద్ర ప్రభుత్వం రైతులయొక్క ధాన్యం ధరలను తగ్గించటం జరిగింది. ఈ ధరలుగురించి మన ముఖ్యమంత్రిగారు సెంట్రల్ గవర్నమెంట్ దృష్టికి తీసుకువచ్చారు. జైన్‌గారి బుర్రలో ఏమిటుందో అర్థం కాదుగాని, ముఖ్యమంత్రిగారు వర్తకులగురించి మాట్లాడుతూ "మేం ధాన్యం ధరలు పెంచము; వర్తకులను గురించి ధరలు పెంచడం మేము ఆలోచించము" అని స్టేట్‌మెంట్ ఇచ్చారు. అది చాలా అక్రమము. ధాన్యం ధర బాగా ఉంటే, రైతు ఎక్కువ పంట పండించే అవకాశం ఉంటుంది. ఎప్పుడైతే ప్రభుత్వం ధర తగ్గించిందో, ఎప్పుడైతే రైతుయొక్క పెట్టుబడి ఖర్చు పెరిగిందో, అప్పుడు ఎక్కువ పంటపండించటానికి రైతులు ప్రయత్నించరు. దేశానికి ధాన్యం చాలా అవుసరం గనుక, హెచ్చు ధాన్యం పండించుకొంటే, మనం ఇతర దేశాలనుండి ధాన్యం దిగుమతిచేసుకోవలసిన అవసరం ఉండదు గనుక, ఎప్పుడైతే మనం విదేశాలనుండి ధాన్యం దిగుమతిచేయమో, అప్పుడు మనకు ఫారెన్ కరెన్సీకూడ నిలవ ఉంటుంది గనుక, సెంట్రల్ గవర్నమెంట్ వద్దని అన్నప్పటికీ, మన ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధతీసుకొని, దేశానికి వెన్నెముక అయినటువంటి రైతును కాపాడటానికి, మన ఆంధ్ర దేశంలో ఉన్నటువంటి ధాన్యం ధరలను పెంచటానికి ప్రయత్నం చేయాలని కోరుతున్నాను. ఈ విషయంలో మన ముఖ్యమంత్రి, కేబినెట్ మంత్రులు తప్పకుండా ప్రయత్నం చేయాలని కోరుతున్నాను. ఈ రోజున రైతులకుగాని, వర్తకులకుగాని ధనం కావాలంటే, వారు చాలా హెచ్చు వడ్డీ ఇస్తేగాని డబ్బు దొరకటంలేదు. వారు తమ కుటుంబాలను పోషించుకోవాలి. వారికి ఖర్చులు ఎక్కువ అవుతున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో రైతు కృంగిపోతే దేశానికి నష్టం గనుక, ఆ రైతుయొక్క క్షేమంకోసం తప్పకుండా ధరలు పెంచాలని, అందుకొరకు గట్టి ప్రయత్నం చేయాలని ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

ఇంక సేల్సుటాక్సు విషయం ఉన్నది. ఆ విషయంలో డిపార్టుమెంట్ చాలా అన్యాయం చేస్తోంది. ఈ మధ్య పత్రికలలోకూడా ప్రచురించారు. ఆరు

సంవత్సరాలుగా, మిల్లులవారు 160 లక్షల రూపాయల సేల్సుటాక్సు ఎగవేసినట్లు చెప్పారు. ఆ డిపార్టుమెంట్ వారు వేసింది, అబద్ధమైన తప్పుడు లెక్కలని చెబుతున్నాను. అది డిపార్టుమెంటువారు చేసిన అన్యాయము. 6 సంవత్సరాలకు లెక్కలు తీస్తే, వారి దృష్టిలో, మిల్లులు గంటకు ఎంత బియ్యం ఆడిందీ లెఖ్ఖలు తీసుకొంటే, 160 లక్షల రూపాయలు మిల్లులవారు సేల్సుటాక్స్ ఎగవేసినట్లుగా వారు తేల్చారు. అది డిపార్టుమెంట్ వారు చేసిన అన్యాయమని నేను మనవిచేస్తున్నాను. వారి హోదాలు పెరగటంకోసం, వారు ప్రావిల్యాన్ని ఏదో విధంగా సంపాదించుకోవటంకోసం, ఇటువంటి తప్పుడు లెక్కలు చూపిస్తున్నారు. నిజంగా ఆ టాక్సు తీసుకొని చూస్తే: యీనాడు లక్షా 44 వేల టన్నుల ధాన్యానికి వారు లెక్కలు వేసి ఉంటారన్నమాట. మన దేశంలో ఎంత ధాన్యం పండుతోంది? ఎంత ధాన్యం మిల్లులకు వస్తోంది? దంపుడు బియ్యంక్రింద ఎంత ధాన్యం ఖర్చవుతోంది? ఒకబస్తో, రెండు బస్తాలో కిరాయి. ఆ ద్రవ్యములో వచ్చే సరుకు తీసివేయాలి. మరి సంవత్సరంకు నిల్వ ఉండే సరుకు తీసివేయాలి.

شری ابارا و شمت کر - سوال کے جواب دینے مطابق تو یماانک کچھ اور ہے اور آنریبل ممبر نےریہ کچھ اور فرما رہے ہیں -

మిస్టర్ చేర్మన్:- సభ్యులు యీ డిమాండ్ పైన మాట్లాడితే బాగుంటుందని వారు అభిప్రాయ పడుతున్నారు. ఇది కూడ మినిస్టర్స్‌కు సంబంధించిందే కాబట్టి వారు దీనిని గురించి కూడా మాట్లాడవచ్చు ననుకొంటాను.

శ్రీ ఎ. సత్యనారాయణమూర్తి:- ఇప్పుడు ఒక కోటి 60 లక్షలు వారు ఇవ్వాలని సేల్సుటాక్సు డిపార్టుమెంటు వారు ఎస్టిమేట్ చేస్తున్నారు. ఇప్పుడు బియ్యం తయారు చేయాలంటే మూడు ప్రాసెస్ ఉన్నవి. ఈ వారం మొదటిపట్టు వేసిన తర్వాత, మళ్ళీ వారం రోజులు పోయాక, రెండవపట్టు వేయాలి. మళ్ళీ ఇంకో వారము రోజులు పోయాక మూడవ పట్టు వెయాలి. అందువల్ల మూడు సార్లు తిరిగితే గాని మిల్లింగు అవటంలేదు. అంతేకాకుండా, ధాన్యంలో బెడ్డ బాగు చేయటానికి కూలీలను ఎంగేజ్ చేయవలసి ఉంటున్నది. ఆ ఖర్చు అంతా వదలిపెట్టి యీనాడు calculate చేయటం అక్రమం. మన కాన్‌స్టిట్యూషన్‌లో ఖరీదుచేసిన ధాన్యానికి సేల్సుటాక్సు వసూలు చేయమని ఉన్నది. కాని ప్రిజంప్షన్ మీద, ఊహాగానం మీద సేల్సుటాక్స్ వసూలు చేయమని ఎక్కడా లేదు. ఇప్పుడు ప్రభుత్వము వారు ఊహాగానాన్ని ప్రధానంగా తీసుకొంటారా? లేక act ను ప్రధానంగా తీసుకొంటారా? ఊహాగానాన్ని ప్రధానంగా తీసుకొంటే, అసలు మనకు బడ్జెటే అక్కరలేదు. కాబట్టి ఇది చాలా అక్రమంగా ఉంది. దానివల్ల యీనాడు 600 మిల్లులు కట్టేయ బోతున్నారు. అంటే, సుమారు 40, 50 వేల మంది కూలీలకు

అన్నం లేకుండా పోతోంది అన్నమాట. ఈ విషయాన్ని మన గవర్నమెంటువారు పరిశీలించి, ఆ డిపార్టు మెంటులో జరుగుతున్న అక్రమాలను అరికట్టేందుకు ప్రయత్నం చేయాలని కోరుతున్నాను.

స్మాల్ సేవింగ్సు గురించి మాట్లాడుతూ, బీద రైతులనుండి డబ్బు వసూలు చేస్తూన్నారని, కమ్యూనిస్టు పార్టీ లీడర్ గారు చెప్పారు. బీదవారి నుండి వసూలు చేస్తున్నారు అన్నది సరైనది కాదు. బీదవారినుండి వసూలు చేస్తే ఎంత వస్తుంది? మనకు కొన్ని కోట్ల రూపాయలు కావాలి, ఆ డబ్బు ధనవంతుల దగ్గరనుండి, భూస్వాముల దగ్గరనుండి వసూలుచేయాలి. ఆ విధంగా వారి దగ్గరనుండి ఆఫీసర్సు వసూలు చేస్తున్నారు. కాని మనం అనుకొన్నంత డబ్బు రావటంలేదు. కారణం ఏమిటి? రైతు యొక్క ధాన్యానికి ధర లేదు. వర్తకుడిని డిస్కరేజ్ చేస్తున్నారు. ఈ డెమాక్రసీలో, మైనార్టీ అయిన వర్తకులకు ఏ విధంగాను తావులేకుండా చేస్తూంటే, వారు ఏ విధంగా ప్రభుత్వానికి డబ్బు ఇస్తారు? రైతులకు ధాన్యం ధర లేకపోతే, వారు ఎట్లా ఇస్తారు? దానితో యీ రెండు గ్రూపులవారు నిరుత్సాహ పడుతున్నారు. కాబట్టి ప్రభుత్వం వెంటనే రైతులలోను, వర్తకులలోనూ ఉన్న నిరుత్సాహాన్ని తొలగించటానికి ప్రయత్నించాలి-ధాన్యం ధరలను పెంచాలి-సేల్సు టాక్సు విషయంలో, పుస్తకాలు నమ్మండి. పుస్తకాలలో తప్పుఉంటే పట్టుకోండి. అందుకు నాకు అభ్యంతరం లేదు. ప్రభుత్వం శిక్షవేయవచ్చు. కావాలంటే ఉరిశిక్ష కూడా వేయవచ్చును. కాని, ఊరికే అన్యాయంగా, ఊహాగానంచేసి, యీ సేల్సు టాక్సు, ఇన్కంటాక్సు లెక్కలు కడితే, యీ దేశంలో ఇక మైనారిటీ కమ్యూనిటీ బ్రతికి జీవించటానికి అవకాశం ఉందా, లేదా, అనిపిస్తుంది. అందుచేత యీ డిపార్టు మెంటు చేసేటటువంటి ఎట్రాసిటీస్ ను తగ్గించేటట్లుగా చూడమని. మన ముఖ్య మంత్రిగారికి మరీమరీ మనవి చేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

**శ్రీ కె. వి. యస్. పద్మనాభరాజు** (రేవడి):-అధ్యక్షా ! ప్రస్తుతము సభవారి ఎదుట ఉన్న Heads of States ను గురించిన డిమాండును గురించి ముఖ్య మంత్రిగారు మాట్లాడుతూ సభ్యులందరు high level లో సభాసాంప్రదాయాలను కాపాడుతూ మాట్లాడవలెనని దీర్ఘోపన్యాసము, గంభీరోపన్యాసము ఒకటిన్నరగంట సేపు చేశారు, అయితే వారి ఉపన్యాసమును చివరిదాకా వింటే అందులో పత్రి కల విషయములు మాట్లాడుతూ నవశక్తి పత్రికను గురించి కూడా మాట్లాడారు. వారు మాట్లాడేటప్పుడు నవశక్తి పత్రికను ఎదో గట్టర్ క్రింద వర్ణిస్తూ ఉపన్యాసము చేశారు. అయితే ఒక పత్రికను గట్టరు అనే పదమును ఉపయోగిస్తూ గట్టరుగా వర్ణించి మాట్లాడారంటే, ఇక వారి ఉపన్యాసము కూడ గట్టర్ లెవెల్ కు పోయిం దేమో వారు ఒక పర్యాయము ఆలోచించుకుంటే మంచిదేమోనని, ఆ విషయము తెలుసుకోవాలని మీ ద్వారా వారికి మనవి చేస్తున్నాను. అసలు యీ గట్టర్

అనే పదము యొక్క లెవెల్, వారు యిచ్చిన ఉపన్యాసము యొక్క లెవెల్ రెండున్నూ పోల్చిచూస్తే రెండు ఒకే లెవెల్ లోనికి పోయినట్లుగా కన్పిస్తున్నది. శాసన సభ్యులు ఉపన్యసించేటప్పుడు శాసన సభా సాంప్రదాయాలను హై లెవెల్లో ఉంచాలని శాసన సభ్యులకు చెబుతున్నప్పుడు యిలాంటి పదజాలమును ముఖ్యమంత్రిగారు ఉపయోగిస్తున్నప్పుడు వారి ఉపన్యాసము ఆ లెవెల్ కే పోయిందేమి అని అనుకోవలసి వస్తున్నది. ఇంతకు వారావిధముగ మాట్లాడారంటే, వారి పార్టీ లోపల ఉంటున్న విభేదాలవల్లను వారికి కలిగే ఆవేదన వల్లను, ఇబ్బందుల వల్లను అనేక విధములైన పదజాలములను తీసుకొనివచ్చి ఉపయోగిస్తూ "ఆపత్రిక పేరు ఏమిటి? మరచిపోయినాను, చెప్పండి" అని తన ప్రక్కన కూర్చున్న తోటి సభ్యులను అడుగుతూ చాలా గంభీరోపన్యాసము చేశారు. దీనిని బట్టి చూస్తే వారు ఏమి మాట్లాడుతున్నారో కూడ గుర్తించుకోలేనంత ఆవేదనలో మునిగియున్నట్లు తెలుస్తున్నది. ఈ నవశక్తి పత్రిక అనేది వారపత్రిక. దాని యొక్క Editor ను నేనే అని మనవి చేస్తున్నాను. ఈ నవశక్తి పత్రికలో ప్రకటించిన ప్రకటనలు అన్నీ ఒక్క యీ పత్రికే ప్రకటించలేదు. ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు వైస్ ప్రెసిడెంటు అయిన శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిగారు ఆంధ్రలో Electricity department లో జరుగుతున్నటువంటి అన్యాయములు, అక్కడ జరిగే దుబారా ఖర్చు లక్షల కొలది అయిపోతున్నదని చెప్పాడు. ఎ. సి. సుబ్బారెడ్డిగారు యిక్కడ యీ శాసన సభలోనే పెద్ద ఉపన్యాసము చేశారు. అది బహుశ సంజీవరెడ్డిగారు మరచి పోయారేమో గుర్తించు కోవాలని ముఖ్యమంత్రిగారికి తెలియజేస్తున్నాను. అలాంటి ఉపన్యాసమును బట్టే యీ దేశములో యిలాంటి అన్యాయము జరుగుతున్నవని ప్రభుత్వము దృష్టికి తీసుకుని వస్తున్నాము. వారు చెబితే ఒక వారపత్రిక ప్రకటించింది. అలాంటి ప్రకటననే ఇంకా కొద్దిగా లంచగొండి తనము, దుబారా ఖర్చు వగైరాలను గురించి పత్రికలలో ప్రకటించడము జరిగింది. ఆ ప్రతికలను గురించి ముఖ్యమంత్రిగారు యిచ్చిన ఉపన్యాసము ఎట్లా ఉన్నదని చూస్తే, ఏమిటి! ముఖ్యమంత్రిగారు యిలాంటి ఉపన్యాసము చేస్తున్నారేమి? ఇంత cheap level కు వచ్చారేమిటి ? అని ఆశ్చర్యము కలిగించింది. కాని ఇలాంటి ఉపన్యాసములతో మాత్రము యీ ప్రభుత్వము యీ దేశములో ప్రజాస్వామ్యమును కాపాడలేదని నేను మీ ద్వారా ముఖ్యమంత్రి గారికి తెలియజేస్తున్నాను. ఈ రోజున ముఖ్యమంత్రిగారు యిచ్చిన ఉపన్యాసము చూస్తే, వారు యీ శాసనసభ వేదిక మీద వారు చెప్పింది చూస్తే, ప్రభుత్వము యొక్క administration కు ఏ విధముగ ఉపయోగపడుతుందో నాకేమి అర్థము కావడములేదు. వారు యిచ్చిన ఉపన్యాసము, వారు కాంగ్రెసు పార్టీలో యివ్వవలసిన ఉపన్యాసమును, యీ సభ యొక్క టైము అంతా తీసుకుని, గంటన్నరసేపు ప్రస్తుతము చర్చించ

వలసిన డిమాండును విడిచిపెట్టి, ఉపన్యాసము చేశారు. దీనివల్ల నేను ఒక్క విధముగ బావించవలసి వస్తున్నది. రేపు 26 వ తేదీన అఖిల భారత కాంగ్రెసు ప్రెసిడెంటు ధేబరుగారు రాబోతున్నారు. గనుక వారి ముందర తమయొక్క గోడు అంతా వెళ్ళబుచ్చటానికి వీలుగా వారి రాకకు ముందుగా యీ రోజుననే వెలిబుచ్చారు. కాని వారి రాకముందు వెళ్లబుచ్చడము మంచిదే. సంతోషమే కాని ప్రస్తుతము యీ దినము సభాఎదుటఉన్న డిమాండు దేనిని గురించి? ముఖ్యమంత్రిగారు చేసిన ఉపన్యాసము యీ డిమాండుకు ఏ విధముగాను సంబంధము లేదు. ఈ డిమాండును గురించిన చర్చ ప్రభుత్వములో administrative structure ఏ విధముగ ఉండాలి, యింతవరకు administration లో ఉన్న efficiency ఎట్లా ఉన్నది, ఇందులో ఉన్న యిబ్బందులు ఏమిటి, ఈ లోపములను, యిబ్బందులను తొలగించి efficiency ను improve చేయటానికి మార్గాలు ఏమిటి, అనే సంగతులను చర్చించవలసి ఉంటే, అది అంతా చర్చించకుండా ఎక్కడో తమ పార్టీలో ఉన్న లొసుగులను, వాటివల్ల వచ్చిన ఆవేదన అంతా యిక్కడ యీ డిమాండు సందర్భములో వెళ్లబుచ్చితే ప్రయోజనము ఏమిటి? డిమాండును గురించి చర్చించి ప్రతి పక్షమునకు సంబంధించిన పార్టీల సలహాలు కూడ, పాటించినా, పాటించక పోయినా అవి ఏమిటో, అందులో ఉన్న మంచిచెడుగులు ఏమిటో విచారించవలెనే కాని, ఇతర ప్రసంగాలను గురించి మాట్లాడడము సబబుగ లేదు. శాసన సభ్యులకు యిక్కడ మాట్లాడడానికి హక్కు ఉన్నది. అట్లాగే మా పార్టీకిగూడ సలహాలు యిచ్చే హక్కు ఉన్నది గనుక మేము మాట్లాడు తున్నాము. అవేమిటో గుర్తించకుండా, ఏవేవో వారి గ్రూపు పోలిటిక్సు, వారికి ఉన్న ఆవేదన, విభేదాలు అవి అన్నీ తీసుకొనివచ్చి, యిక్కడ ఏదో చెప్పారు. ప్రతిపక్షమువారు ఒక పత్రికను నడుపుకుంటూంటే, దానిని గురించి ఉపన్యశించడము ఏ మాత్రము సమంజస మనిపించుకోదు. ముఖ్యమంత్రిగారు ఏమి చెప్పినను మేము మాత్రము జంకటములేదు నవశక్తి పత్రిక అనేది ఏ ఒక్కరి మీద personal grudges పెట్టుకొని నడుపుతున్నదేమి కాదు, ఇక్కడ ప్రభుత్వములో ఏమేమి అన్యాయాలు జరుగుతున్నవో అవి అన్నీ ప్రచురించు తున్నాను.

మిస్టర్ చైర్మన్ :- ముఖ్యమంత్రిగారు సభయొక్క టైము యితరత్రా ఉపయోగించారని అంటూ, మరల మీరు కూడ అదే పనిచేస్తున్నారు. కాబట్టి Demand కు confine అయి, ఏమైనా constructive suggestions ఉంటే ఇవ్వండి.

శ్రీ కె. వి. యస్. పద్మనాభరాజు:– అధ్యక్షా ! నేను ఇచ్చేవి అన్నీ constructive suggestions కాని అసలు యీ "నవశక్తి" అనే పత్రికను prohibit చేయాలా, Editor ను arrest చేయాలా, ఏమిటి ? అని ఆలోచన

పడుతున్నారట. ఏదిచేసినా కూడ సిద్ధముగ ఉన్నాను. కోర్టుకు వస్తే రుజువు చేయటానికి సిద్ధముగ ఉన్నాను. నేను నవశక్తి Editor గా హామీ యిస్తున్నాను. ప్రభుత్వానికి guts ఉంటే రావచ్చు అని నేను మీద్వారా appeal చేస్తున్నాను. ఇప్పుడు మనకు సభ ఎదుటఉన్న ప్రధాన కార్యక్రమమును వెనుకకు నెట్టి యీలాంటి subjects లోనికి పోయేదానికంటే, Demand ను గురించి చర్చించి మంచిది. కాని నేను ఒకందుకు మాత్రము సంతోషిస్తున్నాను. ముఖ్యమంత్రిగారి ఉపన్యాసమువల్ల నేను ఒక్క విషయమును గుర్తించగలిగాను వారి పార్టీలో లొసుగులు ఏర్పడ్డవని, ఏదో కుట్ర జరుగుచున్నదని, ఓహో ! ఇందులో జరిగే అన్యాయము ఇంతవరకు ఉన్నవా అనేది తెలుసుకోగలిగాను. సంజీవరెడ్డిగారు యదార్థమంతా ఉన్నది ఉన్నట్లుగా ఖచ్చితముగ చెబుతానని అన్నారు. మంచిదే సంతోషము. ఆ భోగట్టా అంతాకూడ తెలుసుకోవడము కూడ మంచిదే.

మిస్టర్ చైర్మన్:- మరల రేపు మీ నవశక్తిలో ప్రచురించటానికా ?

శ్రీ కె. వి. యస్. పద్మనాభరాజు:- ఆహా ! ఈ రోజున సంజీవరెడ్డిగారిచ్చిన ఉపన్యాసము రేపు నవశక్తిలో తప్పక ప్రచురిస్తాను. సంజీవరెడ్డిగారి ఉపన్యాసము ఏ లెవెల్‌లో ఎంతవరకు పోయిందో కూడ ప్రజలు అర్థము చేసుకోగలుగుతారు. కాబట్టి తప్పకుండా ప్రచురిస్తాను అని తెలియజేస్తున్నాను.

ఇప్పుడు ప్రభుత్వముయొక్క administrative structure లోని లోపాలను గురించి యిప్పుడు నేను పోదలచుకోలేదు. అయినా ఒక్క విషయము మాత్రము మనవి చేస్తాను. మనకు స్వాతంత్ర్యము వచ్చి యిప్పటికి పది సంవత్సరములు కావచ్చింది. ఈ పది సంవత్సరములలో ప్రభుత్వముయొక్క administration లో ఏమైనా మార్పు వచ్చిందా అంటే, అదేమి కన్పించదు. సామ్రాజ్యవాదుల పరిపాలనలో ఉన్న లోపాలు యీ విధముగ తెలుస్తున్నవి. మనకు ఏదో Socialistic Pattern of Society ను ఏర్పాటు చేసుకోవాలని అంటున్నాము. ప్రథమ పంచవర్ష ప్రణాళిక మాటలతో దాటిపోయింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జరుగుతున్నది. ప్రస్తుతము దేశములో జరుగుతున్న పరిస్థితులను బట్టి, administration లో ఉండే లోపాలను, అవకతవకలను బట్టి, యీ Planning, Socialistic Pattern of Society విధానాలను successful గా ప్రభుత్వం నిర్వహించగలుగుతుందాంటే, నాకు మాత్రము నమ్మకములేదు.

ఇక పోతే ఇప్పుడు రానురాను ఆంధ్ర తెలంగాణా విభేదాలను తీసుకొని వస్తున్నారని అంటున్నారు. ఆ భేదాలను తెచ్చిపెట్టింది మేమేనని ప్రభుత్వపక్షమువారు ఆరోపణ చేస్తున్నారు. కాని ఆ భేదాలు తెచ్చిపెట్టింది మేముకాదు. కాంగ్రెసు పార్టీవారే ఈ భేదాలన్నీ రావటానికి కారణము, కాంగ్రెసు పార్టీలో

ఉన్న group politics వల్లనే. అభిప్రాయాలు, వేరేమి కాదు వాళ్లలో వాళ్లకు ఉన్న భేదాభిప్రాయాలే కారణము. అసలు మనము యిక్కడకు ఎందుకు వచ్చాము! అసలు యిందులో ఏదైనా ప్రమాదము రాబోతుందా అనే భయముకూడ నాకు కలుగుతున్నది. కాని దీనికంతటికీ కారణము ఏమిటంటే, ఆంధ్రలో ఉన్న Officers కు జీతాలు ఒక విధముగాను, తెలంగాణా వారికి మరొక విధముగాను తేడాలతో ఉన్నది. ఏదో integration of laws అనేదికూడ తీసుకొనివచ్చి మాట్లాడుతున్నారు. ఆంధ్రలో టాక్సు హెచ్చుగాఉంటే, తెలంగాణాలో తక్కువగా ఉంటే, అక్కడఉన్న laws అన్నీ రద్దుచేసి, తక్కువ ఉన్నదానితో సమన్వయ పరచి అమలుజరుపుతారు గాని, తక్కువ ఉన్నచోట హెచ్చించరు. ఇలాంటి incidents కొన్ని జరుగుతున్నవి గనుక ఇరుప్రాంతపు ప్రజలలో దురభిమానాలు పెరిగినవి. ఇదిగాక Heads of Departments లో ఉన్న పరిస్థితులను చూస్తే, ఆఫీసర్సు యొక్క seniority ఏ మాత్రము పాటించడము లేదని తెలుస్తున్నది. Electrical Chief Engineer retire అయ్యే పరిస్థితి వచ్చింది. ఆయన స్థానములో మరొకరు senior officer ఉండగా, ఆయనకు ఆ స్థానము యివ్వకుండా, retire అయ్యే ఇంజనీరుకు ఎందువల్ల extension ఇచ్చారు అని వాదన వచ్చింది. ఇలాగే ఆంధ్ర తెలంగాణ ఉద్యోగులమధ్య seniority ని ignore చేస్తున్నారని ప్రభుత్వం అన్యాయం చేస్తున్నదని ప్రాంతీయ దురభిమానాలను లేవదీస్తున్నారు. Director of Public Health గా ఎవరో ఖాదర్ అనే ఆయన senior ఉంటే, ఇంకొకరిని Director గా వేయడము ప్రాంతీయాభిమానాలను లేవదీయడము తప్ప మరేమిటి? ఎవరైనా senior గా ఉంటే, ఆయన seniority ని ignore చేసి, ఆయనకు యివ్వకుండా ఇంకా ఎవరికో ఉద్యోగము యివ్వడము అన్యాయము. ఇలాంటి incidents వల్లనే ఆంధ్ర అని తెలంగాణా అని భేదాలు వస్తున్నవి. దీనివల్ల ఇరుప్రాంతపు వారిమధ్య ఐకమత్యము పెంపొందాలంటే ఏ విధముగా పెంపొందించగలరు? ఇలాంటి విభేదాలు రాకుండా ప్రభుత్వము ప్రయత్నించాల్సి ఉంటుంది.

ఇదిగాక N.G.Os. విషయము ఉన్నది. ఇది ప్రస్తుతము ప్రధాన సమస్యగా ఏర్పడినది. ఇక ఈ N.G.Os. విషయములో మంత్రివర్గము వారు చేసే ఉపన్యాసములు చూస్తే, మీకు అన్ని సౌకర్యాలు చేయటానికే ప్రభుత్వం ఆలోచిస్తున్నది అని వేదికలమీద ఉపన్యాసాలు చేస్తూండడము తప్ప, క్రియ మాత్రము శూన్యము. పన్నులు వేసిన తరువాత N.G Os. జీతాలను పెంచుతామని చెబుతారు. పన్నులు ఎంతవరకు పెంచదలచుకున్నారో అంతవరకు పెంచారు. ప్రజలు భరించలేని స్థితిలోనికి తెచ్చారు. పోనీ, పన్నులు పెంచిన తరువాతనైనా, N.G Os. కు ఏమైనా మేలుచేశారా అంటే, అదేమి కన్పించదు. ఇదివరలో నెహ్రూగారుకూడ

కేంద్రప్రభుత్వోద్యోగస్థుల జీతాలలోగాని, రాష్ట్రప్రభుత్వోద్యోగస్థుల జీతాలలో గాని, ఏలాంటి తేడాలు ఉండరాదని అన్నారు. వారు ఆ విధముగా సలహా యిచ్చినప్పుడు యీ రాష్ట్రప్రభుత్వము ఉపన్యాసాలతో కాలయాపన చేయడము తప్ప, N. G. Os. కు నిజమైన సహాయము ఏదీ కన్పించదు. పోనీ, జీతాలు పెంచక పోయినా, ఏదైనా alternative గా సహాయము చేశారాంటే, అదిగూడ లేదు. ఇటీవల ఆరు రూపాయలు allowance ఇచ్చామని అన్నారు. ఇది హైదరాబాదు, సికింద్రాబాదు సిటీలలో ఉన్నవారికే అని అన్నారు. కాని, అన్ని ప్రదేశాలలోను ఇవ్వలేదు. దీనిని గురించి ఆందోళన పెరిగింది. ఇలాంటి అన్యాయాలు జరుగుతూంటే, తెలంగాణా వారిని అన్యాయము చేస్తున్నారని వారు అనడములో తప్పేమిలేదు. N. G. Os. యొక్క కష్టసుఖములు రాష్ట్రమంతటనూ ఒకటే. N.G.Os. యొక్క కష్టములను పరిశీలించేబాధ్యత ప్రభుత్వముమీద లేదంటారా? వారి జీతాలు పెంచకపోతే, administration లో efficiency ని ఏవిధముగ ప్రభుత్వం maintain చేయగలదు? ప్రభుత్వము యొక్క పరిపాలనా విధానములో తగిన మార్పులు తెచ్చి, N. G. Os యొక్క కష్టనిష్టూరములను ప్రభుత్వము గుర్తించి, వారికి కావలసిన సదుపాయములు చేయాలిగాని, ఊరకనే ఉపన్యాసాలు చేయడమువల్ల ఎవరూ సంతోషించరు. N. G. Os. యొక్క grievances ను గుర్తించకుండా వాటిని గ్రూపు రాజకీయాలతో ముడిపెట్టి, presonal grudges తెచ్చి పెట్టకూడదు. ఇలాంటివి జరిగినందువల్లనే, ఆంధ్ర అని తెలంగాణా అని దురభిమానాలు పెరగటానికి కారణమని చెబుతూ, అలాంటివి జరగకుండా ప్రభుత్వం ప్రయత్నించాలని మనవిచేస్తూ, ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ ఎస్. కె. వి. కృష్ణావతారం:- అధ్యక్షా! సుమారు 1½ సంవత్సరాల క్రిందట ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రము అవతరించింది. ఒకే భాష, ఒకే సంస్కృతి, ఆచారాలు గల ముక్కోటి ఆంధ్ర ప్రజలు ఒకే ప్రభుత్వం క్రింద ఉండవలెననే చిరకాల వాంఛ సఫలీకృతం అయినది. కాని చాలా కాలంనుంచి వేరువేరుగా ఉన్న ప్రాంతాలలోని ప్రజలు ఒకే ప్రభుత్వం క్రిందికి రావడంవల్ల తొలుతలో కొన్ని అనుమానాలు కలగడం సహజం. అట్టి అనుమానాలకు ఎటువంటి సావకాశం లేకుండా చేయాలని నేను ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ముఖ్యమంత్రి సంజీవ రెడ్డిగారు యీ విషయమై తీసుకొంటున్న జాగ్రత్తలను, చర్యలను, ఇకముందు తీసుకోదగ్గ చర్యలను గురించి కూడా వివరించారు. ఎటువంటి అనుమానాలు లేకుండా చేయడానికి గట్టి హామీ కూడా ఇచ్చారు. "మనం అంతా ఒక ప్రభుత్వం క్రిందికి వచ్చాము. మన మంతా తెలుగు వారము. చక్కటి తెలుగు భాష మాట్లాడు వారము, ఇకముందు లేనిపోని అనుమానాలకు సావకాశం లేకుండా ప్రవర్తించి, చక్కగా ప్రభుత్వాన్ని కొనసాగించుకుంటూ, అభ్యుదయాన్ని పొంది,

మన రాష్ట్రాన్ని భారత దేశములోని అగ్రగణ్యమైన రాష్ట్రంగా రూపొందించు కోవాలి" అని నేను ఇదివరకు ఆంధ్రలోని ప్రజలకూ, ఉద్యోగులకూ, తెలంగాణా లోని ప్రజలకూ, ఉద్యోగస్థులకూ విజ్ఞప్తి చేస్తున్నాను. ఇలాంటి అనుమానాలకు అవకాశం లేకుండా మన ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకోవాలి. అనుమానాలు ప్రబలినట్లు ప్రభుత్వ దృష్టికి వస్తే ఏ మాత్రం జాగుచేయకుండా వెంటనే తగిన చర్యలు తీసుకోవాలని నేను ప్రత్యేకంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

ఇక మంత్రులను గురించీ, వారి జీతాలను గురించీ కొన్ని విమర్శలు వచ్చినాయి. మంత్రికి నెలకు రూ.1000/- లు జీతము అయినా లేకపోతే వారిహోదాకు గాని, అవసరాలకుగాని చాలదు. మంత్రుల క్రింద పనిచేసే ఉద్యోగస్థులకు వేల కొలది రూపాయల జీతాలు వుండగా మంత్రులకు, వారి హోదాకు తగిన ఆ మాత్రం జీతం అయినా లేకపోతే దుష్పరిణామాలకు దారి తీస్తుందని నేను అనుకొంటున్నాను.

మంత్రుల పర్యటనలను గురించి కొన్ని సలహాలిస్తున్నాను. ఈ మధ్య డిమాండులపై మాట్లాడిన సభ్యులందరూ "మంత్రులు వారివారి నియోజక వర్గాలకు రావడం లేదని, వచ్చి అక్కడి పరిస్థితులను చూడడం లేదని చెప్పారు. మన ఆంధ్ర ప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలలో మంత్రులు పర్యటించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈనాడు మంత్రుల పర్యటనలకు ఒక దారీ తీరూ ఉండడంలేదు. ప్రత్యేకమైన కార్యక్రమం ప్రకారం యీ పర్యటనలు జరగాలి. ఏలూరులోనో రాజమండ్రిలోనో, విశాఖపట్టణంలోనో చిన్న Bridge ని open చేయడానికో, Primary School నో, Elementary School నో open చేయడానికి మంత్రులు హైదరాబాదు నుంచి సరాసరి వెళ్ళడం, ఆ పని పూర్తి అయిన వెంటనే ఆనాటి సాయంత్రం బండికే బయలుదేరి తిరిగి హైదరాబాదు వచ్చేయడం జరుగుతున్నది. ఇది ప్రజలలో చాలా అసంతృప్తిని కలుగచేస్తోంది. అట్లాకాకుండా, జిల్లా కేంద్రానికో, తాలూకా కేంద్రానికో మంత్రులు వెళ్ళినపుడు కనీసం రెండు రోజులయినా అక్కడవుండి, కనీసం వారిశాఖకు సంబంధించిన ఉద్యోగులను కలుసుకొని, ఆప్రాంతంలోజరిగే కార్యక్రమాలను గురించి వారితో కొంతసేపు చర్చిస్తే చాలా బాగుంటుంది. అంతేకాక అక్కడి ప్రముఖపౌరులనుకూడ కలుసుకొని ఆప్రాంతంలో పరిపాలన ఏ విధంగా జరుగుతున్నదో పరిశీలించి తరువాత ప్రభుత్వోద్యోగులతో ఆయా విషయాలపై చర్చలుజరిపి అందులో ఏమైనా లోపాలున్నట్లయితే సరిదిద్దుకోవలెనని వారికి సలహాలిచ్చే విధంగాచెప్పినట్లయితే చాలాబాగుంటుంది. కాని ఆవిధంగా జరగడంలేదు. కేవలం ఒక raid కు వెళ్లినట్లు ఉన్నది. ఆయాప్రాంతాలకు ఏదో ఒక పనిమీద వెళ్లి మళ్ళా తిరుగు రైలులోనే వచ్చేయడంవల్ల అక్కడి ప్రజలలో చాలా అసంతృప్తి కలుగుతున్నది. ఈ విషయం గమనించాలని ముఖ్యమంత్రి గారికి సవిన

[14th March, 1958

యంగా మనవి చేస్తున్నాను. ఏదో విమర్శ చేయాలనే ఉద్దేశంతో చెప్పిన మాట కాదు ఇది. నేను చెప్పిన విధంగా ఏర్పాటు చేయవలసినదిగా ముఖ్యమంత్రిగారికి ప్రత్యేకంగా విజ్ఞప్తి చేస్తున్నాను. అధికారుల మానసిక ప్రవర్తనలో ఏమీ మార్పు చెందినట్లు కనబడుట లేదు. వారి పద్ధతులు యథాతథంగానే ఉంటున్నాయి. మనకు స్వరాజ్యం వచ్చి 10 సం॥లు అయినప్పటికిన్నీ వారి మనోభావల్లో మార్పులు రాకపోవడం చాలా శోచనీయం. ఇది మన దేశం. మన రాష్ట్రం. మనం శాసన సభ్యులుగా వచ్చి మన ప్రజలకూ, దేశానికి కొంత సేవచేస్తున్నాము. అట్లాగే యితర రంగాలలోనూ, ఉద్యోగాలలోనూ కొంతమంది దేశ సేవ చేస్తున్నారు. బ్రిటిష్‌వారి కాలంలో ఉద్యోగి అంటే ఒక జీతగాడనే భావం ఉండేది. మనకు, స్వతంత్ర భారతదేశం ఏర్పడిన తరువాత అటువంటి భావానికి ఆస్కారం లేదు. ప్రజలందరూ ఏదో ఒక రూపంలో దేశానికి సేవ చేయాలి కనుక, కొంతమంది ఉద్యోగస్థులుగా ఉండి దేశమునకు సేవచేస్తున్నారు. ఇది ఒక పెద్ద national service. Army perosnnel గా ఉండవలసిన అవసరం ఉన్నది. కాని నేటి మన ఉద్యోగస్థులలో అట్టి మార్పు వచ్చినట్లు కనిపించుటలేదు. మన పంచవర్ష ప్రణాళికలు జయప్రదంగా అమలు జరాగాలంటే, స్వపరిపాలన కావాలంటే ప్రజలపై ఉద్యోగస్థులయొక్క ప్రాబల్యం తగ్గవలసి ఉన్నదని, భారత ప్రధాన మంత్రి శ్రీ జవహర్లాల్ నెహ్రూగారు, Planning and Community Development శాఖా మంత్రిగారైన శ్రీ ఎస్. కె. డే గారుకూడా పదే పదే చెబుతున్నారు. అదీ కాక, ఇటీవలనే ఒక రాష్ట్ర ముఖ్య మంత్రిగారు ఉద్యోగుల ప్రాబల్యం తగ్గనంత వరకూ, ప్రజల ప్రాబల్యం హెచ్చనంతవరకూ ప్రజాస్వామ్యం వర్ధిల్లదు, ప్రజా పరిపాలన అనిపించుకోదు' అని చెప్పారు. అందువల్ల పరిపాలనలోని అన్ని స్థాయిల లోనూ, జిల్లా లెవెల్‌లోనూ, రాష్ట్ర లెవెల్‌లోనూకూడ ప్రతి డిపార్టుమెంటుకు కూడ ఒక Advisory Committee ని ఏర్పరచాలి. ఈ మధ్య అసెంబ్లీలోనే ఒక మంత్రిగారు "Advisory Committeesతో పరిపాలన సాగించడమనేది అసంభవం, ప్రతి పనికీ సలహాలు తీసుకొని పరిపాలన చేస్తామా" అని జవాబు యివ్వడం శోచనీయం.

Advisory Committee అనేదాంట్లోనే సలహానివ్వడమనే అర్థం ఉన్నది. ప్రతి డిపార్టుమెంటుకు —Health, Education, Medical, Revenue, Police— మొదలైన శాఖ లన్నింటికీ Advisory Committees ను వేసి వారి సలహాలను తీసుకోవలసిన అవసరం ఉన్నది. అందువల్ల రాష్ట్ర స్థాయిలోనూ, జిల్లాస్థాయి లోనూకూడా ఆ కమిటీలను ఏర్పాటుచేసి పరిపాలన సాగించవలసినదని నేను మనవిచేస్తున్నాను. ఆ Advisory Committees ఇచ్చే సలహాలకు binding లేదు.

National Savings Scheme చాలా ఉపయోగకరమైనది. Public borrowing కు అవకాశం లేదు. కాబట్టి ఈ జాతీయ పొదుపు ఉద్యమాన్ని తప్పకుండా బలపరచవలసియున్నది. కాని ఈ ఉద్యమాన్ని అమలు చేయడంలో చాలా పొరపాట్లు జరుగుతున్నాయి. N. E. S and C. D. Blocks లోనివారికి కూడా యీ కార్యక్రమాన్ని అప్పచెప్పడంవల్ల ఒక ఉద్యోగియొక్క efficiency గాని, inefficiency గాని యీ National Savings Scheme targets ను realise చేయడంమీద ఆధారపడినట్లు కనిపిస్తోంది. పేరు పెట్టు అవసరంలేనివారి దగ్గరకు వెళ్లి ప్రత్యేకంగా "loans ఇస్తామని, పూర్వం 6 నెలలు అయినా, సంవత్సరం అయినా loans యిచ్చేవారు కా"దని చెప్పి 1000 రూ. లు National Savings క్రింద తీసుకొంటున్నారు.

కాబట్టి ఏ ప్లానింగును మనం successful గా implement చేయుటకు ఈ నేషనల్ సేవింగ్సు ఉద్యమం ద్వారా కొంత మొత్తమును సేకరించాలని చూస్తున్నామో ఆ ప్లానింగునే చంపుటకు ఈ ఉద్యమం ఏర్పడుచున్నది. కాబట్టి ముఖ్యమంత్రిగారు ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధతీసుకోవాలని, అది నిజమైన విషయమని దానిని నేను ధృవపరచగలనని మనవి చేస్తున్నాను.

లెజిస్లేచర్ చర్చలలో మనం ఎక్కువ level maintain చేయవలసిందిగా ముఖ్య మంత్రిగారు చెప్పినారు. వారితో పూర్తిగా ఏకీభవిస్తున్నాము. ఆంధ్ర తెలంగాణ విభేదాలు ఉండడంవల్ల, జవాబుదారి లేకుండ విమర్శలుచేస్తూ ఉండటంవల్ల వారు ఆవేశంతో మాట్లాడవలసి వచ్చింది. కాబట్టి వారు standard తగ్గింది అని అన్నందుకు ఎవరు ఆక్షేపించవలసినపని లేదు. లెజిస్లేచర్ యొక్క స్టాండర్డును అభివృద్ధిచేయుటకు స్పీకరు గారు కూడ కొన్ని సమావేశాలు ఏర్పాట్లు చేయాలి. సభ్యులు ఎంత చదువుకొన్న వారైనప్పటికి డిబేట్సు చాలా low level గా ఉంటున్నాయి. అప్రస్తుతమైన, అసందర్భమైన విషయాలను మనం మాట్లాడుతున్నాం. డిబేటు జరుగుతున్నప్పుడు అధ్యక్షులు మధ్యమధ్య కొన్ని విషయముల గురించి సభ్యులకు వివరించుచుండడం చాల మంచిది. అసెంబ్లీ యొక్క dignity ని maintain చేయు నిమిత్తం అప్రస్తుత విషయాలపై దృష్టిని కేంద్రీకరించకుండా, చాల ముఖ్యమైన, బాగా తెలిసిన, అధ్యయనం చేసిన విషయముల గురించి మాట్లాడితే బాగుంటుంది. అనవసరమైన ప్రశ్నలను వేయడం కూడ జరుగుచున్నది. మంత్రులను వ్యక్తిగతంగా అడిగి విషయములు తెలుసుకొనుచున్నచో ఇలాంటి అనవసరపు ప్రశ్నలను వేయ నవసరంలేదు. పార్లమెంటులో ఒక్కొక్క ప్రశ్నకు వంద రూపాయలపైగా ఖర్చు వేయండని చెప్పుచున్నారు. ఇక్కడ దాదాపు 40, 50 రూపాయలవరకు కావచ్చు. కాబట్టి అనవసరపు ప్రశ్నలు వేయడం తగ్గించుకోవాలని, స్పీకర్ గారు కూడ అలాంటి ప్రశ్నలను నిరాకరించాలని కోరుతున్నాను.

లైబ్రరీలో కావలసిన శాసనముల కాపీలు లభించుటలేదు. శాసనములు, బిల్లులు, అమలులో ఉన్న చట్టములను సవరించునప్పుడు గాని, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని చట్టములను సమన్వయము చేయునప్పుడు గాని అన్ని విషయములు పూర్తిగా తెలియనిదే మాట్లాడుటకు సాధ్యము కావడంలేదు. మొన్న వ్యవసాయ డిమాండు ఇచ్చినప్పుడు హైదరాబాదు టెనెన్సి చట్టపు కాపీ లైబ్రరీలో లభించలేదు. కాబట్టి లైబ్రరీ విషయం శ్రద్ధ తీసుకోవలసిన అవసరమున్నది. అంతేకాకుండా క్రొత్త చట్టములు, అమెండ్‌మెంట్సు ప్రవేశపెట్టినప్పుడు, అమలులో నున్న పూర్తి చట్టం కాపీలను సభ్యులకు అందచేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. త్వరత్వరగా శాసనములను చేసుకొంటూపోవడం, వెంటనే తప్పులుండుటవల్ల అమెండు చేసుకోవడం ప్రజానీకంలో హేళనగా తయారౌతుందని మనవి చేయుచున్నాను.

ఎలెక్షన్లలో ఎలెక్షన్ డిపార్టుమెంటు చాలా సమర్థంగా న్యాయంగా పని చేసింది. "They were free and fair" అని మనవి చేయుచున్నాను.

గ్రామ నాయకత్వమును మనం బాగా వృద్ధి చేయాలి. దాని అభివృద్ధికి చాలా ట్రైనింగు క్యాంపు పెట్టుచున్నారు. ఈ గ్రామ నాయకులు తమంతట తామే అభివృద్ధి కార్యక్రమములలో పాల్గొను అవకాశం లేదు. కలెక్టర్లుగాని, ఇతర ఉద్యోగులుగాని వీటిలో ప్రమేయం కల్పించుకొంటున్నారు. ఆ విధంగానే మంత్రులు ప్రతి చిన్న విషయమునకు వెళ్ళుచున్నారు. విశాఖపట్టణంలో బృందావన హోటల్ ప్రారంభోత్సవం మంత్రిగారు చేసినారు. మంత్రులు గ్రామ, జిల్లా నాయకత్వమును పెంపొందించుటకు కృషిచేయాలని మనవి చేయుచున్నాను. మంత్రులు ప్రతి చిన్న విషయమునకు వెళ్ళి వృధాకాలయాపన చేయకుండా ప్రభుత్వంలోని ముఖ్య విషయములపై ఎక్కువ శ్రద్ధ వహించి ప్రభుత్వయంత్రాంగమును చక్కగా నడిపించమని విజ్ఞప్తిచేస్తూ అధ్యక్షులు నాకీ అవకాశమును ఇచ్చినందుకు కృతజ్ఞతను తెలియజేయుచు శలవు తీసుకొంటున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :-అధ్యక్షా! మనం అత్యున్నత ఆశయంతో ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పరచుకొన్నాం. ఆరోజు వ్యతిరేకించినవారే ఈ రోజుకూడ ఏవో కారణాలను చూపి వ్యతిరేకించాలని ప్రయత్నించడం జరుగుతున్నది. ఇది integretion కే చాలా భంగం కలిగిస్తుంది. దానిని మనం సౌజన్యంతోను, సహృదయంతోను ఎదుర్కొని విశాలాంధ్ర ఏకమైనదనే అభిప్రాయమును చాటవలసిన అవసరం ఉన్నది. ఈ సందర్భంలో స్థానిక దురభిమానాలను రెచ్చగొడుతున్న వ్యక్తులు లేకపోలేదు వాటికి జవాబు ఇవ్వవలసిన అవసరం వస్తుందని నేను తలంచుచున్నాను. అక్కడ ఆంధ్రనుండి వచ్చిన అధికారులు, ఇక్కడ తెలంగా

[14th March, 1958

ణాలో ఉన్నవారి విధానములను ప్రధానంగా ఆలోచించుకోవాలి. ఒకవైపు వారు fuedal set upలో తయారై వచ్చినవారు. మరొక వైపువారు Imperialist Government క్రింద Rules-ridden setup నుంచి వచ్చినవారు ఈ రెంటిని సమన్వయం చేయకపోతే అది పాత గుఱ్ఱమును క్రొత్త మనుష్యులు ఎక్కినట్లు ఔతుందిగాని అసలు గుర్రం మారినట్లుకాదు. విశాలాంధ్ర అభ్యుదయం Democratic set-upలో రావలసియున్నది. అందువల్ల ప్రభుత్వం ఈనాటికైనా టాటణాం సిస్టెమో, మొగలాయి సిస్టమో కాకుండ ఈ రెంటిని సమన్వయింపగలిగిన ఒక high power committee ని నియమించి సెక్రెటేరియట్ ఏ విధంగా నడిస్తే బాగుంటుందో ఆలోచించడం అవసరం. ఆంధ్ర నుండి వచ్చినవారు, ఇక్కడ ఉన్న వారు రెండువైపులవారు నష్టపడుచున్నట్లు చెప్పుచున్నారు. మనమంతా దానిని ఉదార దృష్టితో చూడనిపక్షంలో అసలు మనం ఏ ఆశయంతో విశాలాంధ్రను సాధించామో అది వమ్మైపోతుంది ఒక ఉద్యోగస్తుడు లంచగొండితనముకు అలవడి దెబ్బతినగానే దేశం అంతా నష్టమైపోతున్నదని చేసే ప్రచారమును మనం అంతా ఎదుర్కోవాలి. ఒక సందర్భంలో ముఖ్యమంత్రిగారితో ఏకీభవిస్తున్నాను స్వార్థంకొరకు మనలోవున్న వివాదాలను పెంచుకొంటే ఎడ్మినిస్ట్రేషను డెమోక్రసి పద్ధతిలో నడపలేకపోతామేమోనని నాకు అనిపిస్తున్నది.

ముఖ్యంగా జీతాల సమన్వయములో చాలా చిక్కులు వచ్చాయి. ఉద్యోగముల రూల్స్‌లో కొన్ని చిక్కులు వచ్చాయి వీటిని సమన్వయపరచటానికి ఒకే పద్ధతిని అవలంబిస్తే ఈ బాధలు వుండేవికావు. Integration పూర్వం ఆంధ్ర ప్రాంతములో వున్న ఉద్యోగస్తులను టెంపరరిగానే వుంచుతున్నారు. కేంద్ర ప్రభుత్వం చెప్పినట్లే మేము చేస్తున్నామని గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు చెప్పారు. పర్మినెంట్ చేయకపోవటంవల్ల వారికి నష్టం కల్గుతోంది. ఇక్కడ వారు వెంటనే పర్మినెంట్ అవుతున్నారు. కనుక జీతాల గురించి మనం శ్రద్ధగా ఆలోచించవలసివుంది. మనకు ఎన్ని ఇబ్బందులు వున్నప్పటికి జీతాలను సమన్వయము చేయనంతవరకు integration జరగటం అసంభవమని నేను మనవి చేస్తున్నాను. ఒక గుమాస్తాకు 80 రూ. ఇస్తూ, అదే పనిచేస్తువున్న గుమాస్తాకు 66 రూ. ఇస్తే ఒకడిని చూస్తే మరియొకడికి ఏవగింపుగా వుండటం సహజము. ఈనాడు మనము ప్రమాదస్థితిలో వున్నాము. దానిని అరికట్టటానికి ఏ విధంగా intergration వుండాలో బాగా యోచించాలని మీద్వారా ముఖ్యమంత్రిగారికి మనవిచేసుకొంటున్నాను. మనం పాత set up నుండి వచ్చామని, మిషీనరి పాతదని, దానిని మనం మార్చుకోలేమని జవహర్‌లాల్ నెహ్రూ చెప్పారు. వాట్టిని మార్చటానికి టైమ్ కావాలి. టైమ్‌ను expedite చేయకపోతే వచ్చే నష్టం

అపారమని నేను చెబుతున్నాను. సెక్రటేరియేట్ విధానమును ప్రభుత్వము మార్చవలసివున్నది.

అధికారులలో సహకారంలేదు. తెలంగాణా, రాయలసీమ, సర్కారు అనే విచక్షణ లేక అన్ని ప్రాంతాలను అభ్యుదయపథంలోనికి మళ్ళించాలి. నేను గుంటూరుజిల్లానుండి వచ్చాను. ఫైనాన్షియల్‌గా గుంటూరు ఎక్కువ సహకారమిస్తున్నది. అక్కడే ఖర్చుకూడా అవుతుంది. అవసరం వస్తే గుంటూరుజిల్లా త్యాగంచేస్తుంది. గుంటూరు, కృష్ణ, గోదావరి జిల్లాలు విశాలాంధ్ర కావాలన్నప్పుడు, "మా జిల్లాలో వున్న డబ్బును అంతా తీసుకుపోయి వెనుకబడిన ప్రాంతాలలో పోస్తారు. తెలంగాణాకుఇచ్చి మాకు అన్యాయంచేస్తారు, మమ్ములను స్టార్వేషన్ డైట్‌లోనే వుంచుతారు" అని కొందరు అన్నారు. నూతన ఆశయంతో ముందుకుపోతూ, ముందు తరాలవారి అభివృద్ధికోసం, మనం మనవారి శ్రేయస్సుకోసం త్యాగంచేయవలసిందేనని చెప్పాము. ఇది ఒక అధికారి స్వప్రయోజనాల కోసం చేసిన వ్యవహారం కాదు.

ఈనాడు సెక్రటేరియట్‌లో సహకారము లేదని చెబుతున్నందుకు నన్ను క్షమించండి. ఒక కాగితమును పంపిస్తే తనకున్న అధికారాన్ని చూపటానికి గుమాస్తా ఒక querry వేస్తే మరి. 5 సంవత్సరముల వరకు ఆకాగితం బైటకు రాదు. డెవలప్‌మెంట్ ప్రైయారిటిలో ప్లానింగ్ వుంది కాని ఆర్గనైజేషన్‌లో ప్లానింగ్‌లేదు. వర్కింగ్‌లో ప్లానింగ్‌లేదు. కో ఆర్డినేషన్‌లో ప్లానింగ్‌లేదు. డబ్బు పంచటములో ప్లానింగులేదు. ఏ నెలలో ప్రారంభిస్తే పనిపూర్తవుతుందనే అంచనాలు వేయకుండా, మార్చి నెలలో డబ్బు ఖర్చు చేశాం అని అడగటం జరుగుతోంది. తెలంగాణాలోను రాయలసీమలోని వెనుకబడిన జిల్లాలలోను,సర్కార్స్‌లోని వెనుకబడిన తాలూకాలలోను, ప్లానింగ్ మాచింగు గ్రాంట్సు ఇవ్వకపోతే అవన్నీ లాప్స్ అయి డబ్బు వృధా అయిపోయిందని బాధపడు తున్నారు. ప్రభుత్వము కూడా శ్రద్ధగా పనిచేయటము లేదు. ఆఫీసర్లలో బద్ధకము పెరిగిపోయింది. క్రింద ఉద్యోగిపంపించిన కాగితమును చూడటానికే అతనికివీలువుండదు.సూపరింటెండెంట్ అయిన తరువాత అసిస్టెంటు సెక్రటరీ ఎలా అవ్వాలా? ఏ మినిష్టర్‌ను పట్టుకొంటే ఈపని అవుతుంది? లేక ఏ మినిష్టరు చుట్టాన్ని పట్టుకొంటే ఈ పని అవుతుంది అనే వారు ఆలోచిస్తువుంటారు. కాగితాలు చూడక పోవటమే ప్లానింగ్ దెబ్బతినటానికి కారణము. ఏమీ సంబంధంలేని వారినేపై ఆఫీసర్లుగా వేయటంవల్ల ఈ పరిస్థితి ఏర్పడుతున్నది. మెడికల్ డిపార్టుమెంటులో ఈ సంవత్సరము కోటి రూపాయలు లాప్స్ అయినాయంటే ఎంతో దిగులు పడవలసిన విషయము. ఏ డిపార్టుమెంటులో లోపం జరిగినా ఆ బాధ్యత మంత్రులకు కూడా వున్నది. ఆస్టిరిటి చూపించటానికి మంత్రులు చేయవలసిన పని ఒకటి వుంది. తమ జీతాల విషయ

ములో వారు దానిని చూపించవచ్చును. 500 లకు తగ్గించుకొని నిరాడంబరముగా నడవవచ్చును. మాటలు ఎన్ని చెప్పినా ఆచరణలో మార్పు రాకపోతే మంత్రులను రక్షించేవారు ఎవరూ లేరని, ఏ ఆశయంతో కాంగ్రెసు పుట్టిందో ఆ ఆశయమే దెబ్బతింటుందని మనవి చేస్తున్నాను. కాంగ్రెసు ఆశయాల కోసం నేను కొంత త్యాగం చేశాను. కనుక వాటిని గురించి మాట్లాడే అధికారము నాకు వున్నది. నిరాడంబరముతో భారతదేశం ముందుకు పోవాలనే గాంధీగారి సిద్ధాంతమును నేను మరచిపోలేదు. మరచిపోను, ఎవరిని కూడా మరచిపోనివ్వను. జమిందార్లకు వున్న వాటికి మించిన భవనాలలో వుంటూ వాటి కొరకు ఎక్కువ డబ్బును ఖర్చుచేస్తూ గవర్నర్లకు మించిన గవర్నర్లుగా మంత్రులు తయారవుతున్నారు. అధికారులలో ఒకకమిటిని వేయాలని, దానిలోనికి శాసన సభ్యులను తీసుకోవాలని Lord Crips గారు వ్రాశారు. ఎడ్వైజరి బోర్డు అంటే తిమ్మారెడ్డిగారు సహించక పోవచ్చును. కాని ఎడ్వైజరి బోర్డులు డెమోక్రసిలో ఒక ప్రధాన భాగము. ఏ కమిటి కూడా అక్కరలేదని తిమ్మారెడ్డిగారి అభిప్రాయము.

**శ్రీ పి. తిమ్మారెడ్డి** (వ్యవసాయ శాఖా మంత్రి) :- అది నా అభిప్రాయం కాదు. కమిటీలు వేస్తామని సందర్భము వచ్చినప్పుడల్లా చెబుతూ వుంటాను.

**శ్రీ వావిలాల గోపాలక్రిష్ణయ్య**:- "సభ్యులే మాట్లాడుకొండి. కమిటీలు అవసరంలేదు. అవసరమైతే నమస్కారాలుచేసి ఆఫీసర్లతో మాట్లాడండి" అని వారు చెబుతూవుంటారు కాని సమాన హోదాలో నిలబడి ఇది Committee decision, దీనిని మీరు చేయండి అనే దానికి వారు ఒప్పుకోరు. Forest Department లో వారు ఆ అవకాశమును ఇవ్వలేదు. వున్న అన్ని డిపార్టుమెంటులను కూడా శాసన సభ నుండి కొందరు మెంబర్లను అన్ని పార్టీలనుండి తీసుకొని క్రిప్సు చేసిన సూచన ప్రకారము కమిటీనివేసి ఫైనలైజ్ చేయమని నేను మనవి చేస్తున్నాను.

రెవెన్యూ బోర్డును తప్పనిసరిగా రద్దుచేయవలసివుంది. రెవెన్యూ మెంబర్లు ఎంతో అహంకారముగా మాట్లాడుతూవుంటారు. అనంతరామన్ మా జిల్లాకు ఒకసారి వచ్చి "మీ గుంటూరు జిల్లాకు సిగ్గులేదు" అన్నారు. అనేక మందిని జైళ్ళకు పంపిన గుంటూరు జిల్లా, అనేకసార్లు తన్నులు తిన్న గుంటూరుజిల్లా, అనేక మందిని అరెస్టులు చేస్తున్నా చూస్తు వూరుకొన్న గుంటూరు జిల్లాకు ఈనాడు సిగ్గులేదని అనటానికి వారికి సిగ్గులేక పోయింది. అనంతరామన్ ఆ విధంగా అనగానే శ్రీరాములుగారు వెంటనే "మీరు జాగ్రత్తగా మాట్లాడండి" అని చెప్పారు. ప్లానింగ్ కౌన్సిల్ మీటింగులో కూడా మరో అఫీసరు డబ్బు ఎందుకు ఇవ్వలేదు? మీకు సిగ్గు లేదు" అని అన్నాడు. "డబ్బు ఇవ్వటం మా అందరి బాధ్యత"అని ఆయన అనుకోలేదు.

Small Savings Collection ప్రారంభించారు. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలతోపాటు, గుంటూరు జిల్లా అందరికంటె ఎక్కువ యిచ్చింది. చిత్తూరు జిల్లాలో ఉన్న, సేవింగ్సు బ్యాంకు, కోపరేటివ్ Societies లో ఉన్న డబ్బును Small Savings Account కు మార్చి చిత్తూరు జిల్లా 'stands first', గుంటూరు జిల్లా stands next అన్నారు. అకౌంట్లు adjustment చేయడంలేదు. ప్రజల ఆదాయంలో, వారు మిగుల్చుకొన్న దానిలోనుంచి, వసూలు చేయాలి దేశాభివృద్ధి కోసం. ఈ సందర్భంలో రెవిన్యూబోర్డు అధికారి సుబ్రహ్మణ్యంగారు, "సర్కారు జిల్లాలవారు unsocial elements అని అన్నారు. ఇది ఆఫీసర్లు అనదగ్గ మాటలు కావు. వీరు ఆఫీసర్లా ? లేక policy makers గా ఉంటున్నారా ? ఈ విధానం యిట్లా కొనసాగడం మంచిదికాదు. ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకొని, వీళ్ల కళ్లాలు బిగించాలని కోరుతున్నాను. సెక్రటేరియట్ గురించి చెప్పేకన్న లెజిస్లేచర్ గురించి రెండు విషయాలు చెప్పదలచుకొన్నాను.

ఈ లెజిస్లేచర్ ప్రజలకు సంబంధించిన ఒక ప్రజాస్వామిక వ్యవస్థ. మంత్రుల attitude గాని, సెక్రటేరియట్ attitude గాని చూస్తే శాసనసభ ఒకటి ఉన్నదని వారు అనుకోవడంలేదని స్పష్టమవుతుంది. ఈ శాసన సభను ఒక Public meeting గా భావించేటటువంటి మనస్తత్వంతో ఉన్నారు. ఈ మనస్తత్వం యిట్లాగే కొనసాగితే, డెమోక్రసే సజీవంగా ఉండదని మనవి చేస్తున్నాను. ఎలక్షన్స్‌లో గెలుస్తే చాలు - అంతవరకే డెమోక్రసీ అనుకొంటున్నారు. శ్రీ అల్లూరి బాపినీడుగారు అవునని తల ఊపుతున్నారు. అట్లా అనుకొంటే అది తప్పు. శ్రీ బాపినీడు గారిని అనుసరించేవారు - వారు చేసే తీర్మానాలను బలపరుస్తూన్నప్పటికి, తప్పు అని తెలిసికొని, పైకి చెప్పలేనటువంటి దౌర్భాగ్యస్థితిలో యున్నారు. అందువల్ల, శాసనసభలో సభ్యులు చెప్పే అభిప్రాయాలకు విలువ యివ్వమని కోరుతున్నాను. శాసనసభలో సభ్యులు చెప్పే విషయాలు పార్టీ విషయాలుకావు. అవి ప్రజాసమస్యలు. ప్రజాసమస్యలను పరిష్కరించడానికే ఈ సభ యున్నది. రాజకీయ వ్యవహారాలు యిక్కడ తేలవు. దానిని ప్రజలే తేలుస్తారు. మంత్రులు శాసన సభ్యులు అడిగే ప్రశ్నలకు సరిగా సమాధానాలు యివ్వమని విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రశ్నల టైములో శాసనసభను మంత్రులు ఒక యుద్ధరంగంక్రింద భావిస్తారు. ఇరుపక్షాలు తుపాకులు ప్రేల్చుకొన్నట్లుగా సమాధానములు చెప్పుకొనుట నడుస్తోంది. ప్రశ్నలు Public information కోసం అడుగుతున్నట్లు మంత్రులు భావించి సమాధానాలు యిచ్చినట్లయితే, accommodative spiritతో ప్రతిపక్షం కూడ వ్యవహరిస్తుంది. ఇదే డెమోక్రసీలో ప్రధాన సూత్రం అని అనుకొంటాను. వావిలాల గోపాలకృష్ణయ్య లేచాడంటే మీకు భయం. అట్లా భయం ఎందుకు ? మీ మంత్రివర్గాన్ని పడత్రోసే శక్తి మాకులేదు. మేము మంత్రులం అవాలనే

ఉద్దేశ్యంలేదు. ఇంకా కొంతకాలంవరకూ మీరే ఉంటారు. మీలో మీరే కొట్లాడు కోండి. కాని నేను మనవిచేసేది యేమిటంటే శాసనసభకు ఇంతకన్న అధిక హోదా ఇవ్వమని కోరుతున్నాను. "మీరు (ప్రతిపక్షం) కూడ 'డెకోరం' లేకుండా మాట్లాడుతున్నా"రని చెప్పారు. అది నిజమే ! Substantive గా లేక పోతే మా మాటకు కూడ (ప్రతిపక్షం) విలువ ఉండదన్న విషయం మాకు తెలుసు. ఈ శాసనసభను సెక్రటేరియటుక్రింద ఉంచడం న్యాయంకాదు. స్పీకరుక్రింద ప్రత్యేకంగా ఉంచవచ్చునని, మనకు Constitution లో ప్రొవిజన్ ఉంది. దానిని వినియోగించుకోమని కోరుతున్నాను. ఈ రోజున ప్రశ్నలకు ఆన్సర్లు రావడానికి ఆరు, ఏడునెలలు పడుతోంది. మన రూల్సుప్రకారం ఒక నెలరోజులలో సమాధానం రావాలి. కాని 'No' అనికూడ reply రావడంలేదు. తరువాత కమిటీలలో శాసనసభ్యులము వేసినపుడు వారికి తగిన అధికారాలు యివ్వాలి. ఎడ్వయిజరీ బోర్డుగా లేక substantial contribution యిచ్చేటట్లు చూడాలి. కేవలం T. A. లు చేసేటట్లు కమిటీలు ఉన్నందువల్ల ప్రయోజనం ఉండదు. డెమోక్రసీలో శాసనసభ్యులు కూడ ఒక భాగం అని మనవి చేస్తున్నాను. అడ్మినిస్ట్రేటివ్ ఎఫిషెన్సీని పెంచాలంటే మంత్రులు, శాసనసభ్యులు కలసి కృషిచేయాలి. అప్పుడే ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది.

శాసనసభ్యుల సౌకర్యాలగురించి కొన్ని విషయాలు చెప్పదలచుకొన్నాను. అంటే శాసనసభ్యుల జీతాలు యెక్కువ చేయడం గురించికాదు. ఆ మధ్య "శాసన సభ్యుల జీతం 200/- రూ. లకు పెంచాలని ఒక తీర్మానం move చేస్తాము. మీరు అడ్డం రారుకదా" అని అన్నారు. "తప్పకుండా నేను 100/- రూ. లకు అమెండు మెంటు పెడతాను'' అని అన్నాను. తరువాత వారే ఉపసంహరించు కొన్నారు. సభ్యులకు టెలిఫోను సౌకర్యాలు యెక్కువ చేయాలని కోరుతున్నాను. మూడు వందల మందికి తగ్గ టెలిఫోన్ సదుపాయం యిప్పుడు లేదు. అక్కడ క్యూలో నిలబడవలసి వస్తోంది. ఇది చిన్న విషయమే ! ఇక్కడ ప్రస్తావించవలసిన అవసరం లేదు. అయినా, యిదివరలో చెప్పినప్పటికి జరుగలేదు. అందుకోసం యిక్కడ ప్రస్తావించవలసి వచ్చింది.

మనదగ్గర పనిచేసే కూలీలు ఉన్నారు. వారు యీ రాజకీయ పరిణామాలు అన్నిటివల్ల మదరాసునుంచి కర్నూలు, కర్నూలునుంచి హైదరాబాదుకు వచ్చారు. వారి జీతాలలో మార్పులు రాలేదు. వారికి ఈ 6/- రూ.ల D. A. యివ్వవలసి నదిగా కోరుతున్నాను. మంత్రులకు, శాసనసభ్యులకు ఒక్కటే తేడాఉంది. శాసన సభ్యులు ప్రశ్నలువేసిన తరువాత అవి మరచిపోవచ్చు. కాని మంత్రులు అలా కాదు. అవి జ్ఞాపకం ఉంచుకొని అమలు జరిపేటట్లు చూడాలి. కాని యిప్పుడు యిద్దరూకూడ జ్ఞాపకం ఉంచుకోవడంలేదు. ఆ వ్రాసేవాళ్లతప్పు ! శ్రీ గోపాల

రెడ్డిగారు కేంద్రమంత్రిగా వెడుతున్నారు. మనవాళ్లను కాస్త జ్ఞాపకం ఉంచుకో మని మనవిచేస్తున్నాను. ఇదివరలో వారు ఒకమాట అన్నారు. "Pay Commissionను appointచేసి మీరుజీతాలు పెంచుతూంటే రాష్ట్రాలలో ఆందోళన జరుగుతోంది. రాష్ట్రాలు ఆ స్థాయికి రాలేకుండా ఉన్నాయి. కాబట్టి కేంద్ర ప్రభుత్వం ఆవిధంగా పెంచవద్దు" అని, చెబుతానని అన్నారు. ఆ విధముగా చెప్పవద్దని మనవి చేస్తున్నాను.

ఆంధ్రుల చరిత్ర వ్రాయవలసిన అవసరం ఈ రోజున ఎంత అయినా ఉంది. ఒరిస్సాకు 8 వాల్యూముల గ్రంథము ఉన్నది. ఆంధ్ర యూనివర్శిటీవారు ప్రయత్నం చేస్తున్నారు. దానికి కావలసిన ప్రభుత్వసహాయం చేయవలసినదని కోరుతున్నాను. ఆంధ్రుల చరిత్ర అంటే-ఆంధ్ర మానవ అభ్యుదయ చరిత్ర అన్నమాట. దానికి ప్రభుత్వ దోహదం చేయవలసినదిగా కోరుతున్నాను. భారత దేశంలో ఆంధ్ర ప్రదేశ్ స్థాయి పెరగాలి, దేశానికి కావలసిన సమస్యల పరిష్కారంలో ఆంధ్ర contribution యిటుపైన అధికంగా ఉండాలి. పురోగమించే దృక్పథముతో సోషలిస్టు ప్రజాస్వామిక వ్యవస్థ నిర్మాణానికి మనం పూనుకోవాలి. అందుచేత శాసనసభకు అధిక హోదా యివ్వవలెనని కోరుతూ, ఈ అవకాశము యిచ్చిన అధ్యక్షులకు ధన్యవాదములు.

శ్రీ ఇ. చిన్నప్ప (మహబూబ్‌నగర్):- అధ్యక్షా ! నేను యిప్పుడు కొన్ని విషయాలు మనవి చేయదలచుకొన్నాను. ముఖ్య మంత్రిగారు ఉపన్యాసం చేసిన తరువాత, పూర్వం హైదరాబాదు రాష్ట్రంలో ఉన్న ఆచారమే, ఆంధ్ర ప్రదేశ్ యేర్పడిన తరువాత కూడ, ఆ కలుషిత వాతావరణంలోనే యింకా కొనసాగుతున్నదా అనిపిస్తున్నది. పూర్వం నిరంకుశ నైజాం పరిపాలనలో, ఆ నిరంకుశ ప్రభువులు, ప్రభుత్వ ఉద్యోగాలలో ముస్లిములను వేయుట జరుగుతూ ఉండేది. అప్పుడు హిందువులకు తగిన ప్రాతినిధ్యమేలేకుండా ఉండేది. ఆ తరువాత ప్రజాస్వామిక వ్యవస్థ ఏర్పడి, హైదరాబాదు ప్రభుత్వం వచ్చిన తరువాత కూడ, ముఠా రాజకీయాల్లో, కర్నాటక మంత్రులు-కర్నాటకులకు, మహారాష్ట్ర మంత్రులు-మహారాష్ట్రులకు సహాయం చేసుకొనడం జరుగుతున్నదని, support చేసుకోవడం జరుగుతున్నదని, తెలంగాణా ప్రజానీకంలో భావాలు ఉండేవి.

ఏ సిద్ధాంతాలపై మనం ఆంధ్ర ప్రదేశ్‌ను ఏర్పాటుచేసికొన్నామో వాటిని వదలి, ఈ నాడు తెలంగాణా వారికి కాస్త అన్యాయం జరిగిందని, ఇక్కడ కలుషిత వాతావరణాన్ని మనం సృష్టించడం మన భవిష్యత్ శ్రేయస్సుకు భంగకరమని మనవి చేస్తున్నాను. ఆ నాడు ఏవిధంగా ప్రజారాజ్యం, శ్రేయోరాజ్యమని, గాంధీజీ కలలుకన్న రామరాజ్యాన్ని స్థాపిస్తామన్నామో, దానికి వ్యతిరేకంగా ఈ

నాడు కొన్ని సంకుచిత భావాలతో ప్రవర్తిస్తే భవిష్యత్తులో ఎట్టి పరిణామాలకు దారి తీస్తుందో జాగ్రత్తగా ఆలోచించమని కోరుతున్నాను. ఈ రోజున సంజీవ రెడ్డిగారు ముఖ్య మంత్రిగా వుండవచ్చు, రేపు లచ్చన్నగారు ఉండవచ్చు, ఎల్లుండి చెన్నా రెడ్డిగారు ఉండవచ్చు. ప్రజాస్వామ్యంలో ప్రతిదీ మారేవిధానం ఉండనే ఉంటుంది. ఈ మంత్రులు తప్పుచేసినప్పుడు చెవిపట్టుకొనిలాగే అధికారం ప్రజలకు ఉంది. మనం ఈ రోజున "సర్కార్, రాయలసీమ, తెలంగాణా" అనే ప్రాంతీయ భావాలను వదలుకోవాలి. ఎక్కడయినా, ఎవరికైనా, ఏదైనా అన్యాయం జరిగితే ఏ officer అయినా తప్పుచేస్తే వాటిని సరిచేసుకోవాలే కాని, ప్రాంతీయ దృక్పథంతో slogans లేవదీయడం మంచిదికాదు. మొన్న నేను తెలంగాణ మహా సభలో విన్నాను."

آندھرا کے لوگ ایسائی کر رہے ہیں - یہ کہ رہے ہیں - وہ کر رہے ہیں [illegible]
روا رکھا جائے -

ఈ విధంగా slogans లేవదీస్తే ఏ విధంగా వాతావరణం పరిణమిస్తుందో మనం అంతాకూడా ఆలోచించవలసిన విషయం. ఇంతకు ముందు ముఖ్య మంత్రిగారు మాట్లాడుతూ విశాలాంధ్రను ఒక శరీరంగా పోల్చి, అందులో ఏ ఒక్క అవయవంలో, లోపం కలిగినా శరీరాని కంతా బాధ కలుగుతుందని చెప్పారు. ఇందుకు వారిని నేను అభినందిస్తున్నాను. ఆ శరీరంలో ఏ నాటికి బాధ కలుగుతుందో అనే దానిని గమనించి వెంటనే దానికి చికిత్స చేయాలని మాత్రం వారి దృష్టికి తెస్తున్నాను. తెలంగాణా మహాసభలుపెట్టి వాతావరణాన్ని కలుషితం చేయడం బాగాలేదు. మంత్రి వర్గంలోని వారు అన్ని పార్టీల వారిని ఒకచోట సమావేశపరచి "మేము ఫలానా లోపాలను సరిదిద్దాము, ఇంకా ఏదైనాఉంటే సరిచేస్తాము" అని అడగాలికాని, దూరంగాఉండండవల్ల ఇంకా ఎక్కువ అనుమానాలకు ఆస్కారం యిచ్చినవారు అవుతారు. ఆంధ్ర ప్రజలు కొంతవరకు ఆర్థికంగా, వైజ్ఞానికంగా బాగుపడ్డారు. కానీ ఈ తెలంగాణా ప్రజలు కల్లు, సారాలతో కృంగి, కృశించి నాశనమౌతున్నారు. తెలంగాణా ప్రజల అభివృద్ధిని కోరే ప్రతి వారు దీని విషయంలో శ్రద్ధ చూపవలసిన అవసరం ఎంతైనా వుంది. కనీసం ఒక సంవత్సరానికి ఒక జిల్లాలో మద్యనిషేధాన్ని ప్రవేశపెట్టాలి. ప్రభుత్వ ఆదాయంలో లోటు వస్తుందని ఈ పని చేయడం మానరాదు. మొన్న శ్రీ కళా వెంకటారావు ఈ విషయంపై మాట్లాడుతూ తెలంగాణా ప్రజలు, శాసన సభ్యులు అనుకూలంగా లేరని చెప్పారు. వారి అభిప్రాయం తెలిసి కూడ దానికి "ప్లెబిసైట్" ఏమైనా తీసుకొంటారా అని మంత్రి గారిని అడుగుతున్నాను. కొంత మంది మిత్రులు విశాలాంధ్ర ఉద్యమాన్ని బలపరచడంలో తాము తప్పు చేశామేమోనని బాధను

వ్యక్తపరిచారు. నేను వారికి మనవి చేసేదేమిటంటే, వారు ఎట్టి పొరపాటు చేయ లేదు, అని ఎప్పటికైనా విశాలాంధ్ర రావలసిందే. ఏవో కొన్ని చిన్న చిన్న విష యాల్లో మనస్సు బాధపడినంత మాత్రాన తాము పొరపాటు చేశామనుకోవడం సమంజసంకాదని మనవి చేస్తున్నాను.

జాతీయవికాస కేంద్రాలకు ప్రారంభోత్సవాలుమాత్రం జరుగుతున్నాయి. అక్కడ ఎంత అభివృద్ధికరమైన పని జరుగుతోందో, ఇంతవరకు ఒక్క సంవత్సరానికి కూడా, నివేదిక లందచేయలేదు. మహబూబ్‌నగర్ జిల్లాబోర్డు ఆఫీసు సిబ్బందికి, అధికార్లకు రూ. 2 లక్షలు ఖర్చవుతోంది. కాని అక్కడ అభివృద్ధికరమైన పనులు ఏమీ జరగడంలేదు. మనం ఖర్చుపెట్టే డబ్బు సవ్యంగా ఖర్చు అవుతోందా? లేదా? ఎంత అభివృద్ధిని సాధించాము? అనే విషయాలపైన మనం దృష్టిని కేంద్రీకరిం చాలి. ఈనాడు, సర్కార్, రాయలసీమ, తెలంగాణా అనే విభేదాల కలుషిత వాతావరణం ఏదైతే ఉద్భవించినదో దానిని రూపుమాపడానికి, మంత్రులు, ముఖ్య నాయకులు సమావేశమై ఎక్కడెక్కడ ఏ లోపాలున్నాయో వాటిని సరిదిద్ది విశాలాంధ్ర సర్వతోముఖాభివృద్ధికి కృషిచేయాలని మనవిచేస్తున్నాను. ఈ slogan లేవదీసిన సోదరులుకూడా భవిష్యత్‌లో తాము మంత్రివర్గంలోకివస్తే ఈ slogan రేపు ఏ విష పరిణామాలకు దారితీస్తుందో తెలిసికొనమని మనవిచేస్తు న్నాను. ప్రజల సమస్యలను slogan గా తీసుకోవడం మంచిదికాని, ప్రాంతీయ తత్వంపై ఆధారపడి అది జరగడం శ్రేయస్కరం కాదు. హైద్రాబాద్‌రాజ్యంలో ముస్లిములకు ప్రాధాన్యత ఉండేది. మహారాష్ట్ర, కర్ణాటక, తెలంగాణా feelings కూడా ఉండేది. ఇవన్నీ స్వార్థపరులు చేసే పనులు. ముక్కోటి ఆంధ్రుల సర్వతో ముఖాభివృద్ధికోసం యీనాడు వ్యాపించి ఉన్న కలుషిత వాతావరణాన్ని తొల గించడంలో ఇరువైపుల ప్రయత్నం జరగాలని మనవిచేస్తున్నాను.

మంత్రులయొక్క వేతనాలు చాలా అధికంగా ఉన్నాయని ఇప్పుడే మిత్రులు కొంతమంది చెప్పారు. కాని మంత్రులతో పోల్చి చూచినప్పుడు ఈ శాసన సభ్యుల వేతనాలు సరిపోవడంలేదని, ఈ విషయం వెలిబుచ్చితే పార్టీ లీడరు, ఏమనుకుంటారో అనే భయముతో బయటపెట్టకుండా ఉన్నారు కొందరు. ఎందరో మిత్రులు ఈ 150 రూపాయలు, సభ్యులకు సరిపోవడంలేదని అంటున్నారు.

7 వేలు రూపాయలు ఖర్చుపెట్టి వచ్చిన సభ్యుడికి, ఆ 7 వేలు, ఏ విధంగా ఇప్పించే ఏర్పాటుచేసింది ప్రభుత్వము? ఇక్కడ ఇప్పుడు దొరికే "బత్తా", ఇక్కడ ఇంటి అద్దెకు, హైద్రాబాదు hotels కు ఉండే ఖర్చుకే సరిపోతుంది. కావున ఈ వేతనం ఎందుకు సరిపోవడంలేదు.

[Mr. Speaker in the Chair]

[14th March, 1958

వావిలాల గోపాలక్రిష్ణయ్యగారు బ్రిహ్మచారులు కాబట్టి, వారు దీనిని గురించి ఎక్కువ పట్టించుకోవడంలేదు. ఈ వేతనాలనుకూడ బహుశః విరమించుకుంటే విరమించుకోవచ్చు. అభ్యంతరంలేదు.

శ్రీమతి వై. సీతాకుమారి (భాన్సువాడ) : అధ్యక్షా ! ముఖ్య మంత్రిగారు ప్రవేశ పెట్టిన ఈ Demand ను నేను బలపరుస్తున్నాను. ఈ నాడు మన ప్రజానీకాన్ని కలవరపెడుతున్న అనేక సమస్యలను వివరించి, విపులంగా చక్కగా చెప్పారు. దానివల్ల ప్రజలలో, తెలంగాణావారికి అన్యాయంచేశారని ఏదైనా సందేహము ఉన్నట్లైతే అది పూర్తిగా ఈపాటికి తొలగిపోయి ఉంటుందని అనుకుంటున్నాను. కొంతమంది సోదర్లు చెప్పినట్లు ఈ వెనుకబడిన ప్రాంతంపై ఎక్కువగా ఖర్చుపెట్టి, ఏ విధంగా అనారోగ్యమైన పిల్లల విషయంలో, వారి తలిదండ్రులు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటారో అదేవిధంగా, ఈ ప్రాంతంపై, 1, 2 సంవత్సరాలు ప్రత్యేక శ్రిద్ధ చూపించి, ముందుకు తీసుకుపోవాలని వారికి మీద్వారా మనవిచేస్తున్నాను.

ముఖ్యంగా "బుగ్గారం" Election గురించి, సోదర సభ్యులు రావి నారాయణరెడ్డిగారు కొన్ని విషయాలు చెప్పారు. నేనుకూడ అక్కడి ప్రిజలవిషయమై కొన్ని సంగతులు చెప్పవలసి ఉన్నది. కాంగ్రెసువారు ఈ election లో, వారి బాధ్యతను గుర్తెరిగి, ఎంతవరకు పనిచెయ్యాలకో, అంతవరకుకూడ, తమ కర్తవ్యాన్ని సక్రిమంగా నెరవేర్చారు. కాని రెండవపార్టీవారు తమ బాధ్యతలను మరచిపోయి ప్రజలను భయపెట్టి, వెనుక ఎప్పుడో కొంతకాలంక్రిందట చేసిన విధంగా హింసిస్తామని భయపెట్టడం మొదలైన సంఘటనలు జరిగాయి. ఇవన్నీ కాంగ్రెసు వ్యక్తులకు మొరబెట్టుకున్నప్పుడు, వాళ్ళను ఓదార్చి, చేతనైనంతవరకు కొంత ఉపకారం చేసి, ఏవో కొన్ని వాగ్దానాలను చేశారు.

ఈ విషయంలో నేను మనవిచేసేది, ఎవరైతే బహిరంగంగా ఆ అమాయక ప్రిజలను, ఓట్లు వెయ్యకపోతే, చేతులు కాళ్ళేస్తామని, బాధలుపెడుతామని బెదరిస్తున్నారో, అలాంటి ప్రిచారం చేసినవాళ్ళను ముందే arrest చేసి ఏ విధంగా అయినా, వాళ్ళ చర్యలను అరికట్టాలని మీద్వారా మనవిచేస్తున్నాను.

బాధ్యతగల సభ్యులు, సభలో కూర్చొని, చర్చలలో పాల్గొంటూ, ఏవైనా లోపాలుంటే, ఇక్కడ చెప్పే బదులు, "నవశక్తి" మొదలైన పత్రికలలో అవినీతికరమైన వార్తలు వ్రాయడం చాల అవమానకరంగా ఉన్నది. కనీసం వ్రాసినప్పుడైనా మర్యాదను మీరిపోయి ఏమీ ఆధారం లేకుండా తిట్టుతూ ఉండడంవల్ల ఏమి ప్రయోజనం? కాబట్టి, అటువంటి వ్రాతలను ప్రభుత్వం నిరోధించవలసిందని కోరుతున్నాను.

జంట నగరాలకు మంచి, మంచి పథకాలు వేసి, పెద్ద పెద్ద భవనాలతో శోభాయమానంగా చెయ్యాలని మంత్రిగారు చెప్పారు. కాని, పీలై నంతవరకు, పెద్ద పెద్ద మొత్తాల ఖర్చు తగ్గించి, పెద్ద భవనాలపై, కట్టడాలపై ఖర్చును తగ్గించి, బీద ప్రజలకు సదుపాయములను కలుగ చేస్తారని ఆశిస్తున్నాను. సంజీవ రెడ్డిగారి ప్రభుత్వం వచ్చిన తరువాత బీద ప్రజలకు సౌకర్యాలు కలుగుతున్నా యనే ఆశ ఇప్పు డిప్పుడే కలుగుతున్నది. ఆ పేరును వారు సర్వదా నిలబెట్టు కుంటారని గట్టిగా నమ్ముతున్నాను.

శ్రీ డి. కొండయ్య చౌదరి (కందుకూరు):- అధ్యక్షా! ఎవరికైనా మర్యాద ఉన్నది కాని, శాశన సభ్యులకు మాత్రము మర్యాద లేదని మనవి చేస్తున్నాను. ఎందువల్లనంటే వోట్లు తీసుకునే టప్పుడు శాసన సభ్యులు చాలా అవసరం. నాయ కుని ఎన్నుకునే టప్పుడుగాని, ప్రభుత్వంలో crisis వచ్చినప్పుడు తప్ప, మంత్రులు గాని ప్రభుత్వంగాని శాసన సభ్యుల మొర వినడంలేదు. మేము ప్రభుత్వానికి ప్రజలకు మధ్య "పైసాన్" గా పనిచేస్తున్నాం. ప్రజలలోకి పోయి తిరిగేది మేము. ప్రజలు వోట్లు యిచ్చింది మాకు. మేము మంత్రివర్గాన్ని ఎన్నుకున్నాము. ప్రజలు మా ద్వారా ప్రభుత్వానికి విజ్ఞాపనలు యిచ్చుకుంటున్నారు, మేమిచ్చిన విజ్ఞాపనలపై యేమయినా చర్య తీసుకున్నారా, లేదా, అనేది మా బాధ. ప్రజలు మంత్రివర్గం దగ్గరకు రావడానికి అవకాశం లేకుండావుంది. ఒక వేళమంత్రివర్గ సభ్యులు ఎవరైనా గ్రామాలకు వచ్చినప్పుడు అక్కడ ఉన్న అధికారులు ప్రజల దగ్గరనుండి గబగబా కాగితాలు తీసుకుని సెక్రిటరీకి యిచ్చివేయడం జరుగుతుంది. ఆ ఇచ్చిన విజ్ఞాపన లపై చర్య జరిగేది లేనందున ఇట్టి శాసన సభ్యుని ఎన్నుకున్నాం, ఈయనవల్ల యేమీ పని కాలేదు'' అని తిడుతున్నారు. మంత్రివర్గ సభ్యులు ఎవరు గ్రామాలలో పర్యటన చేసినా మాకేమీ యిబ్బంది లేదు. కాని ఆ పర్యటనలలో ప్రజలు యిచ్చిన విజ్ఞాపనలపై ఒక నెలకో, రెండు నెలలకో, మూడు నెలలకో, ఏ చర్య తీసుకున్నదీ శాసన సభ్యులకు తెలియ పరిస్తే "ఇదిగో మంత్రి వర్గం యీ రకంగా మీ విజ్ఞాపనపై చర్య తీసుకున్నారు. లేక ఈ కారణాలవల్ల పనికాలేదు" అని ప్రజలకు మేము చెప్పడానికి అవకాశం వుంటుంది. లేకపోతే మేము అపహాస్యం పాలవుతున్నాము. మా చేతులలో లేదు. మేము ప్రభుత్వాన్ని ఎన్నుకున్న తరు వాత వారి కార్యకలాపాలలో మాకు జోక్యంలేదు'' అని చెబితే "అటువంటప్పుడు వారినెందు కెన్నుకున్నారు?'' అని మమ్ములను వారు ప్రశ్నిస్తున్నారు. మంత్రులు పర్యటన చేస్తున్నప్పుడు దూర ప్రయాణాలకు ఓర్చుకొని ఖర్చులు, పెట్టుకుని, శాసన సభ్యులద్వారా విజ్ఞాపనలు చేసుకున్నప్పుడు వాటిపై చేవ్రాలు పెట్టి సెక్రటరీలకు పారేయకుండా వాటిపై తీసుకున్న చర్యలను, చర్యతీసుకోని నప్పుడు చర్య తీసు కొనక పోవడానికి కారణాలను శాసన సభ్యులమైన మాకు చెబితే, మమ్ములను

[14th March, 1958

కొంచెం మర్యాదగా చూచిన వారు అవుతారని మనవి చేస్తున్నాను. శ్రీ రావి నారాయణరెడ్డిగారు ప్రసంగిస్తూ "మంత్రులు ఊరికే పర్యటనలు చేస్తున్నారు. దీని వల్ల ఖర్చు చాలాఅవుతున్నది" అన్నారు. అది తప్పు. మంత్రివర్గ సభ్యులు ఎప్పుడూ ప్రజలతో contact కలిగి వుండటం మంచిది. కాని దానిని సద్వినియోగం చేయాలి. మంత్రివర్గ సభ్యులు నెలనెలా గ్రామాలు తిరిగి అక్కడి మంచి చెడ్డలు విచారిస్తే చాలా బాగుంటుందని మనవి చేస్తున్నాను. మన కాంగ్రెసు మంత్రివర్గ సభ్యులకు ఒక precedent కూడావుంది. North West Frontier Province లో డాక్టర్ ఖాన్‌సాహెబ్ ప్రధాన మంత్రిగా వున్నప్పుడు తమ పర్యటనలో వచ్చిన విజ్ఞప్తులపై చెట్టుక్రింద కూర్చొని ఉత్తరువులు జారీచేసే వారని తెలుస్తున్నది. అలాగే మన మంత్రివర్గ సభ్యులు కూడా తమవద్దకు వచ్చిన విజ్ఞప్తులను శక్రిటరీలకు పంపించి వారు కలెక్టరుకూ, తహసిల్దారుకూ, రెవిన్యూ ఇనస్పెక్టరుకూ పంపించి కాల యాపన చేయకుండా వెంటనే దగ్గరున్న జిల్లా అధికారులను సంప్రదించి చిన్న విషయాలపైన అయినా—పెద్ద క్లిష్టసమస్యల పైనకాదు—decisions తీసుకొని ఉత్తరవులు పంపించితే బాగుంటుంది. ఇది గమనించాలి. ఈ నాడు శ్రీ బక్షీ గులాం మహమ్మదుగారు కాశ్మీరులో యీ రకంగా పని చేస్తున్నారని తెలుస్తున్నది. ఒక స్కూలు కట్టడానికి స్థలం యివ్వమంటే బ్రహ్మాండంగా సెక్రటరీకి రెవిన్యూ బోర్డుకి పంపడం, అక్కడనుంచి నివేదనలు రావడం యిదంతా లేకుండా 'on the spot' అక్కడ 5 నిముషాలు ఆగి decision తీసుకుంటే చాలా త్వరగా పని అవుతుంది. Justice delayed will be justice denied. ఈ మధ్య మంత్రులు ఒక జిల్లాలోనే ఎనిమిది మందీ, పది మంది మంత్రులు ఒక నెలలోనే పర్యటన చేస్తున్నారు. అది నాకు అవాంఛనీయం కాదనుకోండి. కాని ఉద్యోగస్థులకది చాలా బాధాకరంగా వుంటుంది. వారా విషయం చెప్పడానికి భయపడుతున్నారు. మంత్రులు వచ్చినతరువాత వారు రాక తప్పదు. అందువల్ల ఆఫీసు పనిలో చాలా dislocation అవుతుంది. కాబట్టి నెలకొక మంత్రి వస్తే మర్యాదగా వుంటుంది గాని, మంత్రుల రాకలు రోజూ routine business అయిపోతే చాలా కష్టంగా వుంది. శ్రీ గోపాలరెడ్డిగారు డబ్బు లేదంటారు కనుక ఇక నైనా మంత్రులు అనవసర పర్యటనలు తగ్గించుకొని ఆ విధముగా డబ్బు మిగిల్చవచ్చును. It should not be a flying visit. సాయంత్రం రావడం, మరునాడు ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కిపోవడం కాకుండా రెండు మూడు రోజులు ఆ మంత్రిగారు అక్కడనే మకాంచేసి ఉన్న సంస్థలను, సమస్యలను కూలంకషంగా పరిశీలన చేయడం, ఉద్యోగులతో సంప్రదింపులు జరుపడం, చిన్న విషయాలపై అక్కడనే నిర్ణయాలు తీసుకోవడం, పెద్ద విషయాలను రెవిన్యూబోర్డుతో, సెక్రటరీలతో నిపుణులతో consult చేయవలసినవి యిక్కడికి తీసుకురావడం చేస్తే బాగుం

టుంది. కాని ఒక hospital ను చూడడానికో, సినీమాహాలును తెరువడానికో ఒక చిన్న పంచాయతీ బోర్డులో ఒక భవనానికి శంకుస్థాపన చేసే మిషపెట్టి ఇంత దూరం Hyderabad నుంచి నెల్లూరుకో, చిత్తూరుకో బయల్దేరడం బాగులేదు. అది మర్యాదకూడా కాదేమో అనుకుంటాను. ఇంగ్లండులో అట్లీ ప్రధాన మంత్రిగా వున్నప్పుడు తన official కార్యక్రమంపైన పోయినప్పుడే ప్రభుత్వం కారు ఉపయోగించుకుని, సినిమా హాలుకి భార్యా బిడ్డలతో వెళ్లినప్పుడు సొంత కారులోనో, టాక్సీలోనో పోయేవాడు. అలాంటి ఆదర్శములను యీ ప్రభుత్వం ఎందు కవలంబించకూడదు ? అలా కానప్పుడు ప్రతిపక్ష సభ్యులు ప్రజలతో "చూచారా, మీడబ్బుతో కొన్న ప్రభుత్వపు కార్లలో తిరుగుతున్నారు. విందులారగిస్తున్నారు" అని చెబితే ఆ అమాయకపు ప్రజలు అది నిజమే అనుకొనుటకు వీలుంది. ప్రభుత్వ ధనం దుర్వినియోగం చేస్తున్నాం అనే అపోహలకు ఎందుకు తావివ్వాలని మనవిచేస్తున్నాను. ఇదేమీ పెద్ద వ్యవహారం కాదు. దీనిని మనస్సులో పెట్టుకొని యీ రకంగా ప్రజలలోని అపోహలను తొలగించడానికి ప్రయత్నం చేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను. అధ్యక్షులవారికి మరొక విషయం మనవి చేస్తున్నాను. ప్రశ్నలను పంపించిన ఆరు మాసాలకైనా డిపార్టుమెంటులనుండి ఉత్తరవులురాక, తీరా జవాబు వచ్చేటప్పటికి ఆ ప్రశ్నకు అవకాశం లేకుండా పోవడం, రెండు సంవత్సరాల తరువాత అసెంబ్లీలో ఆ ప్రశ్నకు జవాబు చదివితే "ఓ యవ్వా, ఇది చాలా ముసలికాలం సంగతి" అనిపించడం జరుగుతున్నది. "హరిజను లెంతమంది ? కూలీలెంతమంది ? గుమాస్తా లెంతమంది ?" అనే ప్రశ్నలపై ప్రభుత్వం సంవత్సరాని కొకసారి statistics తయారుచేసి యిస్తాం అని చెప్పారు. అలాయిస్తే బాగుంటుంది. అవసరమైన అంశాలపైన, ప్రభుత్వ దృష్టికి తీసుకురావలసిన వాటిమీద ప్రశ్నించడం, ఆ ప్రశ్నలకు తగు వ్యవధిలో జవాబు రావడం బాగుంటుంది. ఆ విధముగా ప్రశ్నలను filter చేసి ముఖ్యమైన ప్రశ్నలకు వెంటనే జవాబులు వచ్చేటట్లు చేయడం బాగుంటుందని మనవి చేస్తున్నాను. పరిపాలనా వ్యవస్థలో శ్రీ గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు — "Old wine in new bottles" అన్నట్లు — సీసాలు మారడమేగాని వ్యవస్థ పాతపద్ధతినే జరుగుతుంది. చిన్న ఉదాహరణ చెప్పెదను. మా ఊర్లో చుండిచెరువు అని ఒకటివుంది. దానివద్ద ఒక బ్రిడ్జి కట్టవలసివచ్చింది. 1955 ప్రాంతంలో estimate పూర్తయింది. అప్పటినుంచి 1958 సంవత్సరంవరకూ అది P. W. D. కట్టవలెనో లేక Highways కట్టవలెనో నిర్ణయం కాకుండావుంది. ఆ బ్రిడ్జి కట్టడానికి డబ్బు మంజూరై పోయింది. ప్రతినెలా ఒకటో తేదీని జీతాలు పుచ్చుకోడానికి ప్రతి ఉద్యోగి తమ headquarters కి చేరుతారు కదా ? ఆరోజున Superintending Engineer, District Collector, District Superintendent

of Police, వీరందరూ కూర్చుని, అటువంటి చిన్నవ్యవహారాలపై జాప్యం లేకుండా అక్కడికక్కడే నిర్ణయం తీసుకోవచ్చు. ఇప్పుడు ప్లానింగు కమిటీ సమావేశాలు జరగడంలేదా అంటారు. ప్లానింగు కమిటీలలో యేమి జరుగుతుందో అందరికీ తెలియును.

కోదండరామిరెడ్డిగారు, సుబ్బారెడ్డిగారు మొదలయిన మేమంతాకూడా ప్లానింగు కమిటీ సమావేశములలో హాజరవుతుంటాము. మేము పంపిన ఎన్నో తీర్మానాలు ప్లానింగు కమిటీ ఆమోదము పొందుతూ ఉంటాయి. ఐతే యీవిధంగా ఆమోదింపబడిన తీర్మానములమీద ఎట్టి చర్యా తీసుకొనబడినట్టులేదు. ఈ విధంగా మేము తీర్మానాలు చేయడంతోమాత్రమే సంతృప్తిపడవలసియున్నది. ఆ విధంగా కాకుండా ప్రతినెలా ఒకటవ తేదీనాటికి జిల్లా అధికారులందరూ హెడ్ క్వార్టర్సులోనే ఉంటారు కనుక, (కనీసము జీతాలు తీసుకోటానికైనా) యీ విషయము లన్నిటిని పరిశీలించి తగిన చర్య తీసుకోటానికి వీలవుతుంది. ఆనాడు వారందరు సమావేశమై మా తీర్మానాలను పరిశీలించి తగిన చర్య తీసుకొనేటట్లు చేసినట్లయితే మేము తీర్మానములో చేసిన ఫలితం కొంతవరకైనా దక్కుతుంది. 1 వ తేదీన ఆఫీసర్లందరూ సమావేశమైనట్లయితే అందుకు T. A. ఖర్చు ఉండదు. తొందరగా చర్య తీసుకోటానికి వీలవుతుంది. ఈనాడు జిల్లాలలో పి. డబ్ల్యు. డి. ఇంజినీరని, హైవేస్ ఇంజినీరని యీ విధంగా రకరకాల హోదాలలో ఇంజినీర్లు ఉన్నారు. ఒకరితో ఒకరికి సంబంధం ఉండదు. ఒక పి. డబ్ల్యు. డి. ఇంజినీరు ఒక రోడ్డుమీద ప్రయాణంచేస్తున్నప్పటికీకూడ అతడు కళ్లు మూసుకుని వెళ్ళవలసినదేకాని ఆ రోడ్డుయొక్క పరిస్థితులనుగురించి వ్రాయటానికి వీలుండదు. ఈ విధంగా ఆఫీసర్ల టి. ఎ. ల నిమిత్తము హెచ్చు ఖర్చుచేస్తున్నారు. ఏదో ఒకరి ఆధ్వర్యముక్రిందనే యీ ఇంజినీర్లందరూ పనిచేస్తే తొందరగా పథకాలను అమలుచేయటానికి వీలవుతుంది. ఈనాడున్న యీ పరిపాలనా వ్యవస్థను మార్పుచేయడం అవసరం. ఈ విషయమై తగిన చర్య తీసుకొనవలసినదని ముఖ్యమంత్రిగారిని సవినయంగా కోరుతున్నాను.

ఈనాడు శాసనసభ్యులుకూడ ఎన్నో ఇబ్బందులుపడుతున్నారు. ఇక్కడ మేము, నెలానెలా, పదిహేనురోజులు ఉండవలసివస్తున్నది. మమ్ములను ఒక్కొక్క రూములో ఇద్దరు ముగ్గురు చొప్పున ఉండమంటున్నారు. మేమేమీ బడిపిల్లలము కాము. ఇద్దరు ముగ్గురుండటమువల్ల కొంత అభ్యంతరంగా కూడా ఉంటుంది. యం. యల్. ఎ. అనేవారు ఎంతోమంది ప్రజలను కలుసుకోవలసియుంటుంది. పిటీషన్లు వ్రాసుకోవలసియుంటుంది. ప్రక్కన ఉన్నవాళ్ళు వినకుండా కొన్ని సంగతులు మాట్లాడుకోవలసి ఉంటుంది. అందువల్ల వారికి కొంత privacy అవసరము. ఈ విషయాన్ని గమనించి ఒక్కొక్క రూము ఒక సభ్యునికి కేటాయించేటట్లు

చేయమని కోరుతున్నాను. మేము ఎన్నో దరఖాస్తులు, Representations ప్రభుత్వా నికి పంపుకోవలసి ఉంటుంది. అవి టైపుచేయడానికి మాకు ఇద్దరు టైపిస్టులు కావాలి. ఇపుడు ఒక కాగితము టైపు చేయించుకోవాలంటే ఏ హైకోర్టువరకో వెళ్ళవలసివస్తున్నది. అందువల్ల హాస్టల్సువద్దనే ఇద్దరు ముగ్గురు టైపిస్టును నియ మించమని కోరుతున్నాను.

శ్రీ బి. ధర్మభిక్షము (నకిరికల్) : అధ్యక్షా! చాలమంది గౌరవసభ్యులు పరిపాలనా వ్యవస్థలో ఉన్న లోపాలను గురించి చెప్పారు. వాటినిగురించి ముఖ్య మంత్రిగారు శ్రద్ధతీసుకుంటారో లేదో నాకు తెలియదు కాని, నాకు తెలిసిన కొన్ని విషయాలనుకూడ వారి దృష్టికి తీసుకొనివస్తాను. మొట్టమొదట హెల్తు డిపార్టు మెంటువారి అశ్రద్ధగురించి తెలియచేస్తాను. నల్లగొండ జిల్లాలో స్ఫోటకంవల్ల చాలమంది చనిపోవడము సంభవించింది. ఎంతమంది యీ వ్యాధివల్ల చనిపోయి నారో తెలుపవలసినదని నేను ప్రశ్న వేయగా దానికి జవాబు చెబుతూ "ఎక్కువ చావులు కావాలని కోరుతున్నారా" అని ముఖ్యమంత్రిగారు కొన్ని విసురులు విసిరారు. ఈ విధంగా వారు మాట్లాడడం భావ్యం కాదని నా అభిప్రాయము. పేద ప్రజలు యీ ఘోర వ్యాధులకుగురై రాలిపోతూంటే అవహేళనచేయడము న్యాయంకాదు. నల్లగొండ జిల్లాలో ఎంతమంది యీ విధంగా చనిపోయినారో తెలుపవలెనని అడిగితే మంత్రిగారు 154 మంది చనిపోయినారని చెప్పారు. ఇది సరైన లెక్క కాదని నా అభిప్రాయము. నేను ఐదారు గ్రామాలకు పోయి చూచి నప్పటికీకూడ ఆ కొద్ది గ్రామాలలోనే ఐదువందలమందివరకు చనిపోయినట్లు తెలిసింది. గుడివాడ-20, పాలెం-15, తాటికల్లు-60, నగరకల్లు-30, ఓగీరు-80, బొప్పారం-40, నెల్లవండ-20, సూర్యాపేట-50 ఈ విధంగా ఎంతోమందికి స్ఫోటకము సోకి మరణించినప్పటికీకూడ బాధ్యతారహితముగా కొద్దిమంది మాత్రమే చనిపోయినారని చెప్పడము న్యాయముకాదు. ఉద్యోగులిచ్చిన తప్పుడు అంకెలను ఆధారముగా చేసుకొని చులకనచేయడము న్యాయంకాదు. ప్రజా రోగ్యముపట్ల అశ్రద్ధ చూపుచున్నారా? Statistics వల్ల అశ్రద్ధచూపుతున్నారా? సభ్యు లిచ్చిన సలహాలపట్ల అశ్రద్ధచూపుతున్నారా? అనే ప్రశ్నలను మనము సూటిగా ఎదుర్కొనవలసియున్నది. శ్రీ తిమ్మారెడ్డిగారు నకిరికల్లులో యన్. ఇ. యస్. బ్లాకులు ప్రారంభోత్సవముచేస్తున్న సమయంలోకూడ యీ విషయమై వారిని అడిగితే చావులు, బ్రతుకులకు సంబంధించిన సంగతులు ఏ డాక్టర్లకో చెప్పుకోవాలికాని, మాకు చెప్పినా, అసెంబ్లీలో ప్రశ్నలు వేసినా ఏమి ప్రయోజనం లేదన్నట్లు మాట్లాడారు. ప్రజారోగ్యముపట్లచూపుతున్న అలక్ష్యము వల్ల ఎంతోమంది పేద ప్రజలు ఆహుతి అయిపోతున్నారు- ఈనాటివరకూ టీకాలు వేయని గ్రామాలు ఎన్నో ఉన్నాయి, ప్రజారోగ్యముపట్ల ఇంత అశ్రద్ధ

చూపుట సబబుకాదు. ఈ విషయమై ముఖ్యమంత్రిగారు తగిన శ్రద్ధతీసుకుంటారని ఆశిస్తున్నాను.

షెడ్యూలు కాస్ట్స్ వారికి, ఇతర వెనుకబడిన జాతులవారికి ఏదో మేలు కలుగచేద్దామనే సంకల్పంతో రెండుకోట్ల చిల్లర కేటాయించారు. ఐతే యీ మొత్తం ఏ విధంగా ఖర్చుచేయబడుతున్నదో మనము గమనించవలసియున్నది. 'మా వెంట తిరిగిన వారికి ఏదో కొంత పైకము ముట్టచెబుతాం అనే పద్ధతిలో కాకుండా మీ డబ్బు వెనుకబడిన వర్గాలవారి అభివృద్ధికి ఖర్చుచేయాలి. ఈనాడు సొసైటీలుగాని, హాస్టల్సుగాని డబ్బు కాజేసేవారికి ఇస్తున్నారు. ఈనాడు కాంగ్రెసువారు ఎన్ని హాస్టల్సు నడుపుతున్నారు, కమ్యూనిస్టులు ఎన్ని హాస్టల్సు నడుపుతున్నారన్నదే కల్పిస్తున్నారు కాని ఎవరు యీ హాస్టల్సును సక్రమంగా నడుపుతున్నారు అనే విషయమును గురించి ఆలోచించు తున్నట్లు కనపడడంలేదు. సూర్యాపేటలో నేను 15 సం. ల నుండి హాస్టలు నడుపుతున్నాను. కాని దానికి సహాయం కావాలా అని అడిగినవారు లేరు. ఈ మధ్యన అక్కడ డాక్టర్ శర్మ అనేవారు విముక్త జాతుల హాస్టలని ఒక దానిని ప్రారంభించినట్లు విన్నాము. అది ప్రారంభింపబడినట్లు ప్రకటింపబడిన తేదీ తరువాత 15 రోజులకుగాని మాకు తెలియలేదు. ఈ మధ్యన నల్లగొండలోనే హాస్టలు కిచ్చిన డబ్బు దుర్వినియోగమయినట్లు తెలుస్తున్నది. సూర్యాపేట హాస్టలులో సుమారు మూడు వేల రూపాయలు కాజేశాడు ఒకాయన. ఆయన ట్రస్టుఫండు కమిటీ సభ్యుడో, ఆర్గనైజరో అనుకుంటాను. గౌడా హాస్టలు అనేదానికి 5 వందల రూపాయలు మంజూరు చేశామని చెప్పారు. ఆ హాస్టలులో 70 మంది విద్యార్థు లున్నారని తెలవిచ్చారు మంత్రిగారు. స్ఫోటకం వచ్చి ఎంత మంది చనిపోయారో తెలుపవలెనని కోరితే యిచ్చిన సమాధానంవలెనే ఉన్నది యీసమాధానం కూడా. ఆ హాస్టలులో 29 మంది మాత్రమే ఉన్నప్పటికీ 70 మంది ఉన్నట్లు యీ అసెంబ్లీ ముందు మంత్రిగారు తెలవిచ్చారు ఈ హాస్టలులోని బాలురలో 7 గురుకు సగము స్కాలరుషిప్పులు, ఇద్దరికి ఫుల్ స్కాలర్ షిప్పులు ఇస్తున్నారు. తక్కినవారు 33 రూ.లు ఇవ్వాలి. ఈ విధంగా నిర్వహింపబడుతున్నదా హాస్టలు. శ్రీ సంజీవయ్యగారు యీ హాస్టల్సు విషయంలో ప్రభుత్వ విధానాన్ని తెలియచేస్తూ ఇకముందు ఆ సంస్థల పేరుననే డబ్బు ఇవ్వదలచినట్లు చెప్పినారు. దీనివల్ల విద్యార్థులకు ఎంతో నష్టము కలుగుతున్నది, ఇదివరకు ఒక్కొక్క విద్యార్థికి ఇంతమొత్తమని ఇవ్వడమువల్ల కొద్దో గొప్పో ఆ విద్యార్థి నిమిత్తము ఖర్చు జరుగుతూండేది. ఇకముందు ఆ విధంగా జరుగకుండా డబ్బు కాజేయడానికి అవకాశము ఏర్పడుతుంది. బాలబాలికలు యీ హాస్టలు మానేజర్ల దయాదాక్షిణ్యముల మీద ఆధారపడి ఉండవలసిన దుర్గతి పడుతుంది. కాబట్టి మంత్రిగారు సూచించిన విధానం నాలో భయాన్ని రేకెత్తిస్తున్నది, కాబట్టి సంస్థల

పేరున డబ్బు ఇచ్చే పద్ధతి మానుకొని హాస్టలులో ఉన్న విద్యార్థుల సంఖ్యను బట్టి వారి స్థితిగతులను పరిశీలించి డబ్బు ఇవ్వడము జరగాలని మనవి చేస్తున్నాను. నేనీ మధ్యన కాస్మాపాలిటన్ హాస్టల్ చూచాను. చెంచెలగూడ జైలులో ఐదేళ్ళు నేను ఖైదీగా ఉన్నప్పటి స్థితిగతులకన్నా యీ హాస్టలులోని విద్యార్థుల పరిస్థితి అధ్వాన్నముగా ఉన్నదని మనవి చేస్తున్నాను. అక్కడ ఒక హాలు ఉన్నది. ఈ బాల బాలిక లందరూ అక్కడే ఉండాలి. ఒక్కొక్క విద్యార్థికి 15 రూ.ల చొప్పున ఇస్తున్నారు ఏదో రెండుసార్లు అన్నము పెడతా రనుకుంటాను. పూర్వము ఆ హాస్టలులో 50 మంది విద్యార్థులు ఉండేటప్పుడు ఇచ్చేటంత గ్రాంటునే ఇప్పుడు 75 మంది విద్యార్థులున్నప్పటికి ఇస్తున్నందువల్ల వారికి నెలకు 15 రూ.లు మాత్రమే ఖర్చు చేయడం జరుగుతున్నది. ఇదివరలో 20 రూ.లు ఖర్చు చేయబడుతుండేది. ఇప్పుడు దానిని 15 రూ॥కు తగ్గించడము వల్ల విద్యార్థులు ఎన్నో ఇబ్బందులకు గురి అవుతున్నారు. కొంతమంది ఉపవాసము లుండవలసిన పరిస్థితి ఏర్పడింది కనీసము ఒక్కొక్క విద్యార్థికి 20 రూ. లైనా లేనిదే అతని భోజనమునకు సరిపోదని మనవి చేస్తున్నాను.

ఎక్సైజు డిపార్టుమెంటు విషయం మనవిచేస్తాను. ఎక్సైజు డిపార్టుమెంటులో కాంట్రాక్టు పద్ధతి మానివేయవలెనని అబ్కారీ మామ్‌లాలు, సహకార సంఘాలకు ఇవ్వవలెనని చాలా కాలము నుంచి మేము ఆందోళన చేస్తున్నాము. కాని యీనాటి వరకూ ఆ విధానము అమలు చేయడంలేదు. ఈనాడు అబ్కారీ కంట్రాక్టర్లే కాంగ్రెసు వారికి అండగా ఉంటున్నట్లు కన్పిస్తున్నది. ఈ అబ్కారీ కాంట్రాక్టర్ల అండ లేకపోయినట్లయితే కాంగ్రెసు సంస్థ అనే మేడ కూలిపోతుందేమోనని భయపడుతున్నారు. గత సంవత్సములోనే బడ్జటు చర్చ సందర్భములో నేను యీఅబ్కారీ మామ్లాల విషయం తెలియచేశాను. కాని ఇంతవరకు ప్రభుత్వం సరైన చర్య తీసుకోలేదు. వేలం పాటలవల్ల అబ్కారీ కాంట్రాక్టులు ఇవ్వడము జరిగింది. ఐతే యీవిధంగా ఇచ్చిన కాంట్రాక్టులలో నూటికి 65 వంతులు రీ ఆక్షణకు వచ్చాయి. అబ్కారీ మామ్లాలు జిల్లాకు ఒక్కటి చొప్పున కోపరేటివ్ సంఘాలను ఇస్తామని ఇదివరలో కళా వెంకట్రావుగారు చెప్పారు. ఆ విధంగా ఒక జీ. ఒ. జారీచేశారు కూడ. ప్రభుత్వము అమలు పరచిన వేలం పాట పద్ధతి విఫలమైనదని చెప్పడానికి మా దగ్గర నిదర్శనము లున్నవి. వందల కొలది గ్రామములకు సంబంధించిన సమాచారము నాదగ్గర ఉన్నది. ఐతే స్పీకరుగారు అపుడే గంటకొట్టుతున్నారు కనుక నేను దానిని గురించి చెప్పలేకున్నాను. సూర్యాపేట, నల్లగొండ, కరీంనగరు, మహబూబ్‌నగరు మొదలైన ప్రాంతములలో ఎన్నో అబ్కారీ మామ్లాలు రీ ఆక్షన్‌కు వచ్చిన పరిస్థితు లున్నవి. కో-ఆపరేటివ్ సంఘములకు జిల్లాకు ఒక్కొక్కటి చొప్పున అబ్కారీ మామ్లాలు ఇచ్చుటకు నిర్ణయం జరిగినప్పటికి ఎవరి

కివ్వాలి. ఏగ్రూపు వారికి ఇవ్వాలి అనే విషయములను ఆధారం చేసుకొనే యీ వ్యవహారమంతా నడచుచున్నట్లు తెలుస్తున్నది. కో ఆపరేటివ్ సొసైటీలకు ఆబ్కారీ మామ్లాలు ఇస్తామని శ్రీ కళా వెంకటావుగారు గత సెషను సందర్భములో ప్రకటించారు ఆ ప్రకారంగా జిల్లాకు ఒక సొసైటీకి ఇవ్వవలెనని ఆర్డర్సువచ్చాయి. ఐతే ఏ సొసైటీకి ఇవ్వవలెననే విషయంలో చాలా గందరగోళము జరుగుతున్నది. మా నల్లగొండ జిల్లాలో 6 సొసైటీలు గత సంవత్సరం రిజిష్టరై ఉన్నాయి. యీ 6 సొసైటీలలో ఏదో ఒక సొసైటీకి ఇవ్వవలెనని నేము కోరినాము. అదే విషయాన్ని అధికారులకు తెలుపుతున్నాము. జిల్లా అధికారులు కూడ ఇట్టి సూచననే చేశారు. సూర్యాపేట సొసైటీకి వారు మొట్టమొదట ఇవ్వదలచినారు. ఐతే ఏ కారణముచేతనో ప్రభుత్వమువారు దేవరకొండకు దీనిని ఇవ్వడం జరిగినది. దేవరకొండలో కళాలీలు లేరు. చెట్లు కూడా లేవు. అక్కడ మల్లేశం అనే పెద్ద కంట్రాక్టరును ఆధారము చేసుకొని, యీ విధంగా ఇవ్వడము జరిగింది. ఇద్దరు ముగ్గురు శాసన సభ్యుల సలహా ప్రకారముగా రెవిన్యూ డిపార్టుమెంటు వారితో ముఖ్యమంత్రి ఇంటర్వ్యూ అయి యీ విధంగా చేయించడము జరిగింది. ఐతే దీనిని సూర్యాపేట సొసైటీకి ఇవ్వవలెనని మా జిల్లా శాసనసభ్యులందరూ కళా వెంకట్రావుగారికి తెలియచేసుకున్నారు. కో ఆపరేటివ్ డిపార్ట్మెంటువారు కూడా ఆ విధంగానే చేయవలెనని తీర్మానము పాస్‌చేసి దానిని కన్‌ఫర్‌మేషన్‌కు పంపినారు. ఎక్సైజు డిపార్టుమెంటువారు కూడా అదేవిధముగా తీర్మానించారు. ఇక సూర్యాపేటకు ఆబ్కారీ మామ్లా ఇచ్చుటకు ఆర్డర్లు జారీ అవుతాయని మేమందరము ఆశిస్తూఉండగా దానిని తిరిగి దేవరకొండకు ఇచ్చుచున్నట్లు టెలిగ్రాంద్వారా ఆర్డర్లు రావడం జరిగింది. ఇటువంటి పరిస్థితులలో ఎక్సైజు డిపార్టుమెంటు నడుస్తున్నది. సహకార ఉద్యమాన్ని అభివృద్ధి పరచవలెననే ఉద్దేశ్యముతోకాకుండా కేవలము గ్రూప్ ప్రయోజనముల నిమిత్తము ఆబ్కారీ మామ్లాలను ఉపయోగించుకుంటున్నట్లు కన్పిస్తున్నది. ప్రభుత్వం యీ విషయంలో తగుశ్రద్ధ తీసుకొనవలెనని మనవి చేస్తున్నాను. బకాయిల విషయంలో చాలా ఆందోళనగా ఉన్నది. సామాన్య ప్రజలవద్దనుంచి బకాయిలు వసూలు చేస్తున్నారు. వాళ్ల కొంపా,గోడు జప్తుచేసి డబ్బు చాలవరకు వసూలు చేయడము జరిగింది. కాని హైదరాబాదు, శికిందరాబాదు నగరములలో నివసిస్తున్న పెద్ద, పెద్ద కంట్రాక్టర్లవద్దనుంచీ లక్షలాది డబ్బు రావలసి ఉన్నప్పటికి దానిని ప్రభుత్వం వసూలు చేయలేకుండా ఉన్నది. ఆ పెద్ద కంట్రాక్టర్లు హైకోర్టులలో రిట్ దరఖాస్తులు వేయడము వల్ల యీ విధంగా ప్రభుత్వం బకాయీలను వసూలు చేయలేకపోతున్నది. ఇటాలియా లాంటి పెద్ద పెద్ద కంట్రాక్టర్లను ప్రభుత్వం వదలివేస్తున్నది. కాని కేవలము గీత వృత్తిమీదే ఆధారపడి జీవనయాత్ర గడుపుకున్నవారిని ఎన్నో విధాల బాధించి

యీ బకాయిలను వసూలు చేసింది. ఈ పెద్ద పెద్ద కంట్రాక్టర్లు జిల్లాలకు ఎగబడి వేలం పాడుతున్నారు. వారు ఎంతోడబ్బు బకాయిలు పెట్టినా ప్రభుత్వం వారినుంచి వసూలు చేయకుండా ఉన్నది. ఏడవ నెంబరు సర్క్యులర్ ప్రకారము ఆస్తి లేనివాళ్ళ విషయంలో కొంత కరుణ చూపించవలెనని ఉన్నప్పటికీ కూడ ప్రభుత్వము అట్టివారివద్ద నుంచే బలవంతంగా బకాయిలు వసూలుచేస్తున్నది కాని, పెద్ద పెద్ద కంట్రాక్టర్లు లక్షలకొలది మొత్తము యీయవలసి ఉన్నప్పటికీ కూడ ఏమి చేయలేకుండా ఉన్నది.

శ్రీ యమ్. రాజేశ్వరరావు :-అధ్యక్షా ! ఈHeads of States డిమాండ్ మీద మాట్లాడుతూ ప్రస్తుత పరిపాలనా వ్యవహారాలలో ఉన్న లోపాలగురించి చాలా మంది మిత్రులు చెప్పారు. నేను చాలా సంవత్సరాలుగా, యీ పరిపాలనా వ్యవస్థ పునర్నిర్మాణము చేయటంకోసం పూనుకొని ఆ పని ప్రారంభించాలని, ఆ సమస్యను యిప్పుడు పూర్తిగా పరిష్కారం చేయలేకపోయినా, పరిష్కారం చేయవలసిన అవసరాన్ని గుర్తించాలని పదేపదే పార్టీ సమావేశాలలోను, అసెంబ్లీలోనూ చెబుతూవచ్చాను. బడ్జెటులో ఉన్న ఫిగర్సు చూస్తూంటే రోజు రోజుకూ పరిపాలనా వ్యవస్థమీద ఖర్చుపెట్టే డబ్బు పెరిగిపోతోందని, personnel ఎక్కువగుతున్నదని కనబడుతున్నది. ఒక ప్రక్క ఉద్యోగస్థులు తమ జీతాలు చాలడం లేదని, ఉన్న స్టాఫ్ సరిపోవడంలేదని అనుకుంటూంటే, మరొకప్రక్క ఈ రెంటి మధ్య ఒక cleavage ఏర్పడింది. దీనికి మనం ఒక పరిష్కార మార్గాన్ని కనుక్కోవాలి. ఈ పరిపాలనా వ్యవస్థ సరిగా పనిచేయుట లేదనే అసంతృప్తికూడా ప్రజానీకంలో ఉన్నది. ఈ సమస్యలను జాగ్రత్తగా పరిశీలనచేసి సక్రమమైన పరిపాలనా వ్యవస్థను రూపొందించడానికి తగిన చర్యలు తీసుకొనుట అవసరం. ఈ మధ్య బ్రహ్మానందరెడ్డి కమిటీని వేశారు. Economy Committee అన్నారు. కాని terms of reference చాలా restricted గా ఉన్నవి ఏ డిపార్టుమెంటులో ఎంత మందిని తగ్గిస్తే మనకు డబ్బు మిగులుతుందనే ఉద్దేశంతో ఈ కమిటీని వేసినట్లు కనపడుతుందిగాని, పరిపాలనా వ్యవస్థలో మార్పు తీసుకురావటానికి ఈ కమిటీ ఉద్దేశింపబడినట్లు కనపడుటలేదు. ఈ మధ్య కేరళ ప్రభుత్వమువారు కూడా వారి పరిపాలనా వ్యవస్థ పునర్నిర్మాణము కోసము ఒక కమిటీని వేసినట్లు, ఈవిషయమై తమ అభిప్రాయాలు తెలుపవలసినదిగా పంత్ మొదలైన పెద్దవారిని, Public Administartion లో Experts నూ కోరినట్లుగా వింటున్నాము. సెంట్రల్ గవర్నమెంటువారు కూడా ఒక కమిటీని వేశారు. ఈ నాడు ప్రజాస్వామికములో ప్రజలకూ ప్రభుత్వమునకూ దగ్గిర సంబంధం ఉన్నది. ప్రజల కోరికలు ఎక్కువైనవి. వారియొక్క అవసరాలను పిటిషన్ రూపముగా ప్రభుత్వమువద్దకు తీసుకు రావటం, వాటిని పరిష్కరించవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉండటంవల్ల, పని

విపరీతముగా పెరుగుతున్నట్లు కనిపిస్తోంది. ఈనాడు నేను సెక్రటేరియట్‌లో కొంతమంది మిత్రులను కనుక్కుంటే ఒక్కొక్క అసిస్టెంట్ సెక్రటరీ రోజుకు 175 మొదలు 225 files వరకు చూడవలసి వస్తోందని చెబితే ఆశ్చర్యం వేస్తోంది. పని తగ్గలేదు. అలాంటి పరిస్థితులలో Economy కమిటీని వేశారు. వ్యవస్థలో మార్పుకొరకు ప్రయత్నించకుండా retrenchment చేయటానికి ప్రయత్నించుట ఎంతవరకు సమంజసమో అర్థము కావటంలేదు. కొన్ని డిపార్టుమెంట్సులో, ప్లానింగులోనూ, అక్కడా కొద్దిగా retrench చేయటానికి అవకాశం ఉన్నా, అలా భారీఎత్తున చేయుటకు ఈ విధానంలో ఎంతవరకు అవకాశం ఉన్నదో బహు జాగ్రత్తగా పరిశీలించాలి. పునర్నిర్మాణము చేయాలంటే ప్రభుత్వమునకు యిచ్చే con^rete suggestions ఏమిటని అడుగుతారు. ఇదివరకు యిచ్చాము. టౌలెన్ హోమ్ సిస్టమును 100 సంవత్సరముల క్రిందట బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకోసం ప్రవేశపెట్టారని, దానిని మార్చాలని కోరుతున్నారు. హైదరాబాదులోకూడా అదేవిధముగా తయారైన రూల్సు ఉన్నాయంటారు. కాని టౌలెన్‌హోమ్ సిస్టము పూర్తిగా చెడు అని చెప్పటానికి వీలులేదు. ఇటీవల రాజాజీగారు కూడా కలత్తాలో మాట్లాడుతూ ఈ నాడు మద్రాసు రాష్ట్రములో ఉన్న పరిపాలనా వ్యవస్థ కేవలం ఇండియాలోనే కాకుండా ఆసియాలోకెల్ల మంచి వ్యవస్థ అని చెప్పారు. కాని యిప్పటి పరిస్థితులకు అనుగుణ్యంగా అందులో మార్పులు తీసుకురావాలని కోరటంలో అందరూ ఏకీభవిస్తున్నారు. ఏవిధముగా రూపొందించాలో నేను చెప్పలేను. దానికి ఒక High Power Commission ను కొంతమంది Experts తో వేసి, అవసరమైతే యితర రాష్ట్రాలలో ఉన్నవారి సహాయము కూడా తీసుకొని పరిశీలించుట అవసరం. మన వ్యవహారాలు త్వరలో కావాలంటే, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సకాలంలో సక్రమంగా నిర్మింపబడా లంటే ఈ పరిపాలనా వ్యవస్థను పునర్నిర్మాణము చేయకపోతే మనము అమలు పరచలేము. దెబ్బతింటాము అనేది గుర్తించి తగు చర్యలు తీసుకోవాలి. వెంటనే ఒక కమిటీని వేయాలి. వి. వి. సుబ్రహ్మణ్యంగారు పరిపాలనలో అనుభవము కలిగినవారు, యిందులో మార్పు తీసుకురావలెనని ప్రయత్నం చేస్తున్నట్లు విన్నాము. Restricted terms కాకుండా wide terms of reference యిచ్చి పునాదులనుంచి administration మార్చటానికి పరిశీలన చేయించాలని మనవి చేస్తున్నాను. సెక్రటేరియట్, జిల్లా అడ్మినిస్ట్రేషన్ పోలిస్తే సెక్రటేరియట్ అనేక రెట్లు బాగా పనిచేస్తున్నదని చెప్పక తప్పదు. జిల్లాలలో అట్లాలేదు. ఒక ఉదాహరణ చెబుతాను. జిల్లాలలో ఒక కాగితమును R. I. చూడాలి, తరువాత తాసిల్దారు, R D. O, కలెక్టరు చూడాలి. ఒక్కొక్క appellate stage లో రెండేసి appeals, రెండేసి revisions, మళ్లీ G. O. ప్యాస్ అయితే

అమెండ్‌మెంట్స్ యీ విధంగా ఉంటూ, finality లేకుండా ఉన్నది. ఏదైనా complicated issue వచ్చినప్పుడు నలుగురు ఆఫీసర్లూ కలిసి, అక్కడకు వెళ్లి ఒక్కసారి final decision ఎందుకు తీసుకోరు? ఈ Process అంతా R. I., తాసిల్దారు, R. D. O, కలెక్టరు repeat చేయాలంటే ఆ కాగితం సంగతి ఎప్పటికి తేలుతుంది? ఇక్కడ సెక్రిటేరియట్‌లో సెక్రటరీస్ వారానికి ఒకటి రెండుసార్లు సమావేశం కావటం, వారివారికి సంబంధించిన files చూచుకొని సంప్రదించి dispose చేస్తున్నట్లు విన్నాను ఈ సిస్టమును జిల్లాలలో కూడా ప్రవేశపెట్టితే బాగుంటుంది ఈ పరిపాలనా విధానాన్ని పునర్నిర్మాణం చేయకుండా ఏ Economy Committee వేసినా ప్రయోజనం లేదు. ఇవాళ సెక్రటేరియట్‌లో మూడు నాలుగు సంవత్సరాలనుంచి పనిచేస్తుచేస్తూఉన్న వారిని రిట్రెంచ్ చేస్తారని చాలా అనుమానాలతో ఉన్నారు. అది నిజమే. ఇక్కడ అనర్సు బి. ఏ లు చదువుకొని నాలుగయిదు సంవత్సరాల అనుభవం గడించిన తరువాత పొమ్మంటే భయపడుతున్నారు. తెలంగాణాలో యిదివరకున్న సిస్టము వేరు. ఆంధ్ర సిస్టము వేరు. ఈ రెంటిని సమన్వయము చేయవలసిన అవసరం ఉన్నది. లేకపోతే పని delay అవుతోంది. తెలంగాణా వారికి కూడా ట్రైనింగు యిచ్చి వారితో కలుపుకొని తీసుకుపోవాలి. ఆంధ్రలో ఒక సిస్టము అలవాటుపడి experience సంపాదించిన వారిని తీసివేయటం ఇక్కడ తెలంగాణా వారికి ఆ సిస్టము నేర్పకుండా administration నడిపించాలంటే అంతా paralyse అవుతుందనే అనుమానముకూడా లేకపోలేదు. అందుచేత రిట్రెంచ్ మెంట్ effect చేయాలంటే ప్రథమ సోపానంగా డిస్ట్రిక్ట్సునుంచి తెచ్చిన వారిని డిస్ట్రిక్ట్సుకు పంపి, యిక్కడఉన్న వారిని యిక్కడే ఉంచుట మంచిది. తెలంగాణావారు cope up కాలేకపోతే ట్రైనింగు యివ్వాలి. ఇంకొకసంగతి విన్నాను. S. S L. C. ఫెయిల్ అయి, మున్షీ చదివినవారు uppeer division గుమాస్తాలుగా, సూపరింటెండెంట్సుగా పనిచేస్తున్నవారు ఉన్నారు. చాలా ఆశ్చర్యంవేసింది ఈనాడు వారిని తీసివేయుటకు వీలులేదు. అవసరమైన ట్రైనింగ్ యివ్వాలి, లేదా ఉద్యోగాలలో పెట్టడానికి అవకాశంఉందేమో చూడాలి. ఇవాళమళ్లీ నేను అడుగుతున్నాను. మన మంత్రివర్గము యొక్క ముఖ్య కార్యక్రమం ఏమిటి? విధానాలను నిర్ణయించడం వారిపని. వారు చేయవలసినది execution work కాదు. దానికి Heads of the Departments ఉన్నారు. చాలామందిసిబ్బంది ఉన్నది. మంత్రివర్గం చేసిననిర్ణయాలు అమలు జరుగుతున్నాయో లేదో చూడాలి. రెండు కారణాలచేత మంత్రులే Executive Offiers గా కనిపిస్తున్నారు. Files చూడటం, ఆర్డర్సు pass చేయడం చేస్తున్నారు. రెండవది వీరికి టైము కనపడుట లేదు. ఎప్పుడూ tours కు వెళ్తూంటారు. కర్నూలులో అసెంబ్లీ ఉండగా నేను చెప్పాను. టూర్సువలన మంత్రుల టైము waste అవుతోందని, public funct-

tons కోసం ఒక Minister ను appoint చేస్తే మిగతావారికి టైము మిగులు తుంది అంటే నవ్వుకున్నారు కూడా Head quarters లో కూర్చొని జాగ్రత్తగా files చదివి, policies, implement అయ్యే విషయము discuss చేసి సక్రమంగా అమలు జరిగే పద్ధతి చూడాలి. ఒక మంత్రిగారు ఇక్కడ బడ్జెటు సెషను జరుగు తుంటే అక్కడ సినిమాను తెరవటానికి ప్రభుత్వ డబ్బుమీద వెళ్ళిన సంగతి నాకు తెలుసు. ఒక మంత్రిగారు ఇత్తడికొట్టు open చేయటానికి ప్రభుత్వ డబ్బుమీద వెళ్లిన విషయం నాకు తెలుసు. ఇక్కడ అసెంబ్లీ ఏమయితేనేమి? ఇక్కడ మంత్రులతో ఉండి బాధ్యతతో పాల్గొనవలసిన అవసరంలేదా? లేకపోతే సభాగౌర వానికి భంగం అనిపిస్తుంది. ఇక్కడ గౌ॥ సభ్యులు చెప్పేది విని, మంత్రులు Cabinet Meeting కు హాజరైనపుడు యీసమస్యలన్నీ శ్రద్ధగా discuss చేసి సక్రమంగా పరి ష్కారం చేసేందుకు ప్రయత్నం చేయాలి. అప్పుడు. public expenditure తగ్గించ డానికి అవకాశం ఉంటుంది. 1 లక్ష 90 వేల రూపాయలు వారి జీతాలకు అయితే, 1 లక్ష 67 వేల రూపాయలు T.A లకు అవుతున్నది. (ఇతరఅలెవెన్సెస్ కాకుండా) డబ్బు చాలకపోతే, ఇంకా వెయ్యి, రెండు వేల రూపాయలు జీతం ఎక్కువ తీసు కోండి. అందుకు మాకు అభ్యంతరం లేదు. కాని, యీ డబ్బులకోసం మంత్రులు ఇలా తిరుగుతున్నారని ప్రజలలో అపోహ కల్గిస్తూ, మన కాలాన్ని వ్యర్థంచేసేస్తూ, అసలు చేయవలసిన పనులు సక్రమంగా చేయలేకపోతున్నారని మేము బాధపడు తున్నాము. కాబట్టి సాధ్యమైనంతవరకు అటువంటి ప్రయాణాలు తగ్గించి, తమ టూర్ పాలసీని మంత్రులు మార్చుకోవాలని కోరుతున్నాను. మంత్రులు టూర్ వెడితే, వారి వెనకాల పోలీసులు రావాలి, ఆర్. డి ఓ. రావాలి; కలెక్టర్ రావాలి. వీళ్లందరికీ టి. ఎ. లు కావాలి. వీళ్లందరికి పని నష్టం. మంత్రులు టూర్ చేసినందువల్ల అక్కడి పరిపాలనకు ఇబ్బంది కల్గించినవారు అవుతారు. మంత్రులు టూర్ చేయకుండా ఉంటే, కలెక్టర్స్, మిగతా ఆఫీసర్స్ సౌకర్యంగా పరిపాలన చేసుకోవటానికి, వారు తమ నార్మల్ డ్యూటీస్ డిస్చార్జి చేసుకోటానికి అవకాశం ఉంది. ఎవరైనా కొత్త మంత్రి వెడితే, నాకు అభ్యంతరంలేదు. వెళ్ళిన ఊరికే ఇరవై సార్లు మంత్రి వెళ్ళవలసిన అవసరం లేదు. వారు మంత్రులన్న సంగతి అందరికీ తెలుసు. ఏదైనా అర్జంట్ పని ఉంటే, ఇక్కడ సెక్రటరీతో డిస్కస్‌చేసి వారు డెసిషణ్ తీసుకోటానికి వీల్లేకపోతే, ఆ ఫైల్ తీసుకువెళ్ళి కలె క్టర్‌తో డిస్కస్ చేయండి. కాని ఆ విధంగా చేయటం జరగదు. మంత్రులు ఎందుకు వెడుతున్నారని, మేం అనుకోవాలి? మీటింగ్ ఎడ్రస్ చేయటంకోసం వెడుతున్నారా? ఎవరెవరు ఏ విధంగా పరిపాలన చేస్తున్నారో, ఏ విధంగా యీ. పరిపాలన సాగుతోందో ప్రజలు గమనిస్తూనే ఉన్నారు. కేవలం మనం వెళ్ళి ముఖాలు చూపించినంతమాత్రంచేత ఏమీ జరగదు. మంత్రులు ఠిక్ స్కిన్డు అయి

[14th March, 1958

పోయారని ప్రజలు అనుకొంటున్నారు. "ఎవరనుకొన్నా ఏమీ లెక్కచేయవలసిన పనిలేదు; అది ఒక అలవాటు అయిపోయిందని" అనుకోటానికి వీలులేదు. మనం కూడ కొంత సెన్సిటివ్‌గా ఫీల్ కావాలి. మంత్రులు కలెక్టివ్ రెస్పాన్సిబిలిటీకి బాధ్యులై ఉన్నారు కాబట్టి, శాసనసభకు బాధ్యులై ఉన్నారు కాబట్టి మేము చెప్పే విషయాలు సావధానంగావినండి. కాబట్టి ప్రభుత్వం వెంటనేయీపరిపాలనను పునర్నిర్మాణం చేయటానికి ఒక కమిటిని వేసి, ఆ కమిటీకి వైడ్ టరమ్స్ ఆఫ్ రిఫరెన్స్ ఇచ్చి, పునాదులతో సహా యీ ఎడ్మినిస్ట్రేషన్ మార్చటానికి ప్రయత్నం చేయకపోతే మనం ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలు జరపటంలో చాలా బాధలుపడతాము. అందుకు మనం బాధ్యత వహించవలసి ఉంటుంది కాబట్టి, యీ విషయాన్ని ముఖ్యమంత్రిగారు జాగ్రత్తగా ఆలోచించి, మళ్ళీ వచ్చే శాసన సభా సమావేశంనాటికైనా, ఇలాంటి కమిటీని మేము చూస్తామనే ఆశాభావంతో నేను సెలవు తీసుకొంటున్నాను.

మిస్టర్ స్పీకర్ : రేపు ఉదయం ఎనిమిదిన్నరగంటలవరకు సభ వాయిదా వేయడమైనది.

*The House then adjourned till Half Past Eight of the clock on Saturday, the 15th March, 1958.*

